కాలను రాసిపెట్టిన పాత కాగితాలను వెలికితీసి ... ఆదేపనిగా ఆలోచించు కుంటూ, చించుకుంటూ ... ఎప్పటికో తెలివి తెచ్చుకుని, తన తెలివిమాలిన తనానికి ఎంతగానో నొచ్చుకుని, తనను తానే నిందించుకుంటూ ఉంటోం దీమధ్య.

అపర్ణ ఇంకా కొంప జేరలేదు. దీనికీ మధ్య తిరుగుళ్లు ఎక్కువైనయి. పన్నెండు కావస్తోంది? ఇప్పటిదాకా ఇది ఎక్కడికి పోయినట్లు ? ఎక్కడికన్నా పోనీ...ఏట్లోకి... వల్లకాట్లోకి ... దీని కోసం తను భోజనం చెయ్యకుండా ఎదురుచూస్తున్నదన్న జ్ఞానమే లేదు. ఆకలి, కడుపులోని పేగుల్ని కొండ చిలువలా చుట్టుకుని పడుకుంది. నిర్మలకు దప్పికవుతోంది. కనీసం మంచినీళ్లయినా తాగాలంటే కుర్చీలో నుంచి లేవాలి, లైటువెయ్యాలి, వంటిం ట్లోకి వెళ్లాలి... బద్ధకం కదల నివ్వటం లేదు. మళ్ళీ రంగులు రంగులుగా రింగులు రింగులుగా తిరుగుతూ ఆలోచనలు...

కాలం అన్నన్ని కలల అలల్ని రేపుతూ ఉంటే, పురుషుడు చుట్టుముట్టి ఆశల వలలు విసురుతూ ఉంటే, ఆడ పిల్ల చేతికి చిక్కిన చేపపిల్లకాక మరే మవుతుంది ? ఆపైన దాని బ్రతుకేమవు తుంది ? కడకు మళ్ళీ ఆడపిల్ల కడలి పాలే అవుతుందా ? ఈ ఆద్యంతాల నడుమ కడగండ్ల వడగళ్లవానే మిగులు తుందా ?

ఓ జల్లు విసురుగావచ్చి ఆమె పాదా లను తాకింది. నిర్మల చటుక్కునపాదా లను వెనక్కి లాక్కుంది. ఇంక ఈ వాన ఇవాళ్టికి వెలవదు కాబోలు. ఏమిటో ఈ చిత్రం ? నేలపైనున్న నీరు మరిగి ఆవిరై, అంతెత్తుకు ఎగిరే మేఘ శకలాలై, తిరిగి కరిగి నీరై, నేల పాలై - అప్పుడంత ఎత్తుకు ఎరగట మెందుకూ, ఇప్పుడింత దీనంగా, హీనంగా, మట్టిపాలై పోవటమెందుకూ .. తనూ ఇంతేకదూ, నేలమీద నడుస్తూ, ఒద్దికగా జీవిస్తూండగా, నిద్రిస్తూన్న తన జీవనవనంలోకి ఆయన వచ్చి, ఎక్కడో గుండె కుదుళ్లలోని గూళ్లలో నున్న యవ్వన కోరికల శారికలను ఒక్కసారిగా రివ్వున ఎగరగొట్టి, కేరింతలుకొట్టి, తన చేయిపట్టి రారమ్మని ముందుకులాగితే...మీద పడితే, అదిమి పెడితే ... తనుమాత్రం మనిషి కాదా, మగువ కాదా ?

కుర్చీలో కూర్చున్న నిర్మల నెమ్మ దిగా కదిలింది. ఆమెకు దాహంగా ఉంది. ఈ పిల్లముండ ఇంకా రాలేదు. తేదీ మారిందిగాని, దీనికి కొంప గుర్తుకు రాలేదు. 'ఈ తద్దినం నా కొద్దు' అంటే ఆయన విన్నాడు కాదు. పైగా అన్నాడు కదా "నా మీద నీకేమాత్రం గౌరవం ఉన్నా అపర్ణను నీ కూతురులా చూసుకో."

ఆడదాన్నయి పుట్టినందుకు, అర్ధ బ్రతుకు వ్యర్థంగా గడిచినందుకు ఎప్పు దన్నా పిల్లలు లేరన్న చింత రవ్వంత కలిగినా వింత లేదుగాని ఇలాంటి రాక్షస పిల్లను తన కూతురుగా అంగీకరించ లేదు. ఆ మాటకొస్తే ఏ ఆడదీ మరొకరి కడుపున పుట్టిన పిల్లల్ని తన పిల్లలుగా చస్తే భావించలేదు. ఎవరన్నా అలా భావిస్తున్నట్లు, ప్రేమిస్తున్నట్లు కనిపిస్తే, కేవలం అలా నటిస్తున్నారన్న మాట. ఇద్దరి స్త్రీలతో ఇంత పరిచయాలు పెంచుకున్నాక గూడా ఆయనకు ఆడ దాని హృదయం తెలియలేదంటే ఏమనుకోవాలి ?

అసలింతకీ తన మంచితనమే తనను వంచిస్తూ వస్తున్నది. తన మెతక దనాన్ని అలుసుగా తీసుకనే ఆయన ఆనాటినుంచీ ఈనాటిదాకా ఇన్ని విధాల ... అన్ని విధాలా అన్యాయం చేశాడు.

ఈ కృష్ణమోహనరావు అనే మోహనాకారుడు ఆనాడు తన ఇంటి పక్కకు, తన పక్కకు చేరకుండా ఉంటే, ఈనాడు తానింత హేయమైన స్థితిలో ఉండవల్సిన అవసరం ఉండి ఉండేది కాదు.

ఆయన నలభయ్యో పడిలో పడినా, పయ్యెద సర్దుకునే వయసొచ్చిన పిల్లలు ఎదిగొచ్చి ఎద మీద కూర్చున్నా, ఆయన ఇంకా ముప్ఫయి ఏళ్లు లోపుగానున్న మనిషిలాగానే కనబడతాడు. అదృష్ట వంతులు కొందరికి ఎన్నేళ్లొచ్చినా, వచ్చిన యవ్వనం అలానే నిల్చి ఉంటుంది. దురదృష్టవంతులు కొందరిని ముందరగా, తొందరగా వార్ధక్యంవచ్చి వాటేసుకుంటుంది. ఆయన మొదటి తరగతికి చెందినవాడు.

ఇందులోనే కాదు, ఎందులోనైనా ఆయనది మొదటి తరగతే. ఆయనకేం తక్కువ? వెయ్యిరూపాయల జీతం. ఇంటి నిండా బోలెడు సామాన్లూ, హంగూ, ఆర్భాటం, రయ్‌మని తిరిగి రావటానికో స్కూటరూ, ... కార్యేషు మంత్రిలాంటి భార్యా, కూతురూ, కొడుకూ...అయితే చివర చెప్పిన వాటి గురించి, తనకు చివరిదాకా తెలియనివ్వలేదు.

భార్యకేదో జబ్బుచేస్తే రెండేళ్ల పాటు ఆయన అసలు కుటుంబ మంతా గుంటూర్లోనే ఉండిపోయినారు. ఈయన ఒక్కరూ ఇక్కడ ఉంటూ ఉండేవాడు. తను ఒక్కతే పక్క వాటాలో ఉంటూ ఉండేది, పగలంతా ఉద్యోగం చేసుకుంటూను, ఎంతకీ నిద్రరాక రాత్రంతా డాబామీద పచార్లు చేసుకుంటూను.

కృష్ణమోహనరావు గొప్ప మాంత్రి కుడు ఎవరిపైపైనా చూసి మెత్తగా నవ్వాడో, కాలికి ఉచ్చుతాడు బిగించి లాగాడన్నమాటే. కాసేపు మాటా మాటా




కలిపి మాట్లాడాడో, ఎంతటివాళ్లనయినా ఇట్టే బోల్తా కొట్టించాడన్నమాటే. ఆయన వ్యాపార రహస్యమంతా అక్కడే ఉంది మరి.

ఆయనెప్పుడూ ఎంతో బిజీ బిజీగా ఉంటాడు. గజిబిజీగా తిరుగుతూంటాడు. వారానికి నాలుగురోజులు ఊర్లు తిరిగి వస్తుంటాడు. తన దగ్గరకు వచ్చిన కాసేపూ ఈ ప్రపంచాన్నే మర్చిపోయి నట్లు ఎంతో కౌతుకంగా తన కళ్లల్లోకి చూసేవాడు. క్షణక్షణానికీ చెరకు వింటి బాణాలను వదిలేవాడు. తామిద్దరిమధ్యా ఆంక్షల వలయాలు చెరిగిపొయ్యేవి. అప్పుడింక కాంక్షల కేబరా డాన్సులు మొదలయ్యేవి.

అమ్మో...కాంక్షలంటే అవి కేవలం మోహినీ పిశాచాలే ! దగ్గరగా వచ్చి, మనకు వచ్చి, నమ్మకంగా అరచేతిని అందిపుచ్చుకుని, నెమ్మదిగా తమవెంట నడిపించుకుని వెళ్తాయి. మనకోసం ఒక్కటొక్కటిగా నవస్వర్గధామాల ద్వారాలు తెరుస్తాయి. మనం ఎదురుగా చూస్తే, కనుగీటి చెయ్యూపి లోనికి రమ్మని పిలుస్తాయి. అన్నీ తెల్సినా ఆ కాసేపూ మైమరిచిపోయి వెళ్తాంగదా. మన వెనక వెనక్కి వెళ్ళే అవకాశాల తలుపులు దభేల్‌మని మూసేస్తాయి. ఇంక అప్పుడా కాంక్ష అనే కామినీ పిశాచం, చుట్టూ పరిస్థితుల కౌగిలి బిగించి బలంగా నొక్కుతూ, బాధ్యతల గోళ్లతో ములపాన రక్కుతూ ఉంటే, బాధేగాని సుఖం ఉండదు. అప్పుడక్కడ ఆశించిన స్వర్గమూ ఉండదు. కలలు గన్న దుర్గమూ ఉండదు. ఎప్పుడో కళ్లుతెరిచిచూస్తే, తెలివి తెల్లగా తెల్లారాక చూస్తే, ఊరి బయట పాడుబడ్డభవంతిలో

విశ్రాంతిలో మనం ఉండగా, జరిగీ జరగని ఆశ నిరాశల రాక్షస కామక్రీడా కలాపాలు! అంతకుముందు మనం ముందుకువస్తూ క్రిందికి నెట్టేసిన వాళ్లు చుట్టూ కనిపించకుండా ఉండి వినిపించే విలాపాలు!! పైగా నిర్గతిలేని దుర్గతి!...తన గతీ అలానే అయింది. ఈ కాంక్షలే తనని మోసపుచ్చి, మభ్యపెట్టి, ఆయన కౌగిట్లోకి నెట్టి ... తీరా తెలివి తెచ్చుకునేటప్పటికి చాలా ఆలస్యమైపోయింది! తను ఒంటరిగా ప్లాట్‌ఫాంమీద మిగిలిపోయింది.

అతి నిరాడంబరంగానే అయినా, ఆయనతో తన పెళ్ళి జరిగిపోయింది. మిస్ నిర్మల ఎమ్మే అయినతను, మిసెస్ కృష్ణమోహనరావు అయిపోయింది. అంతా తన ఫ్రెండ్సేగాని ఆయన తరపు నుంచి ఒక్కరూ రాలేదు. ఎందుకని అడిగితే కౌగిలి లోగిలిలోకి లాగి సమ్మోహనంగా నవ్వేశాడు. మారు మాట్లాడకుండా తన నోరు తెరవకుండా ఉక్కిరి బిక్కిరి చేశాడు.

ఆ రోజుల్లో తన జీవనవనంలోని ఊహల వృక్షాలనిండా రంగురంగుల మోహాల పూలుపూసి గుత్తులుగుత్తులుగా వేలాడుతుండేవి. అప్పుడా ఆనంద సీమలో సువర్ణ రజిత మణిమయ ఖచిత కిరీటాలు [illegible] ఉత్సవులు ధరించిన [illegible] స్వప్నాలెన్నో కళకళలాడుతూ, [illegible]లాడుతూ, కళ్లముందు కదలాడుతున్నట్లే ఉండేవి క్రమంగా ఉదయారుణ కిరణాలు విస్తరించేటప్పటికి, భ్రమలుగొలిపే వెన్నెల కాంతులు వెలాతెలా పోయినయి. అనురాగ రాగ గీతమాలికలు మారోగిన తన బ్రతుకు బృందావనం, ఇప్పుడు అయిష్టపు కీచురాళ్ల ధ్వని ప్రతిధ్వనించే కీకారణ్యం ... వ్చ్ ... ఈ బ్రతుకొక భ్రాంతి.

రోజూ విసుగులేకుండా రొటీన్‌గా మనం ఆడుకునే ఈ ఆశనిరాశల ఆటలో తుదిగెలుపు ఎప్పుడూ మనది కాదు. అంతంచూసే మృత్యువుది. దాన్ని జయించలేదింతవరకూ ఈ ఆరడుగుల మనిషి.

దూరంగా ఎక్కడో, ఎవడో తన కబంధహస్తాలతో ఆకాశాన్ని అప్పడంలా విరిచేసినట్లు ఫెళఫెళమని ధ్వని. దాన్ని వెన్నంటి తళుక్కుమని వెలిగి ఆరిపోయిన కాంతి కిరణం. క్షణంసేపు భరించలేని వెలుగు కొరడా ఝుళిపించినట్లు వెలిగింది

ఇదుగో ఇల్లాంటి మెరుపు వెలుగు లాంటిదే. ఆయనతో తను కాపురం వెలగబెట్టిన ఆ మూడునెలల ముచ్చటేను. ఇంత వెలుగు ఉండగా ఇంక తనకేం తక్కువ అనుకున్నది ఆదంతా ఎంత భ్రమ! అంతలోనే, సంతోషమంతా మటుమాయమైపోయింది. ఇప్పుడు గట్టిగా పట్టేసుకున్న ఈ

చీకటి మునుపటికన్నా మరింత దట్టంగా ఉంది.

తర్వాత ఎప్పుడో తెల్సుకుంది, ఆయనకో భార్య ఉందనీ, ఇద్దరు పిల్లలు ఉన్నారనీ. తెల్సిన క్షణంలో పిడుగుపడింది. ఆ పిడుగుపాటు తగిలి తనలోని ఉత్సాహం ఉన్నపళంగా చచ్చింది.

"ఏమిటిదంతా!" అని అడిగితే, చిద్విలాసంగా నవ్వేసి, ఎప్పట్లా బుగ్గ మీటేసి, "ఇప్పుడు నీ కొచ్చిన నష్టం ఏమిటి?" అన్నాడు.

నష్టం ... బ్రతుకును కాష్టంలోకి ఈడ్చాక ఇంక లాభనష్టాల ప్రసక్తి ఏముంది? ఆ తర్వాత తనను ఎప్పటిలా నవ్వించాలని ఆయన ఎన్నో పాట్లుపడ్డాడు. మొక్కుబడిగా ఎవరి ముందన్నా బలవంతంగా నవ్వుతెచ్చుకున్నా, మునుపటిలా స్వచ్ఛంగా ఇంక తను నవ్వలేదు. అమావాస్యనాడు తెల్లని పున్నమి వెన్నెల ఎల్లాకాస్తుంది? అశ్రువులు కురిసే సమయాన, ఆనందాతిహాసం ఎల్లా వెళ్ళివిరుస్తుంది? లోకం అంతా తనని చూసినవ్వుతుంటే, తను నిండుగా ఎలా నవ్వుతుంది?

ఈ జీవితం జాతకాలు, తను క్లాసులో నిలబడి నల్లబల్లమీద చాక్‌పీస్‌తో రాసే వ్యాసాలు కావు గదా, పదే పదే చెరిపి వేయటానికీ, తిరిగి మళ్ళీ కొత్తగా రాయటానికీను. తీసుకున్న నిర్ణయం తప్పు అయినా, చేసుకున్నాక ఇంక తప్పదు గదా మరి. అందుకని సహనాన్ని సలహా అడిగింది. అదేమో ఇంక నోరు మూసుకుని పడి ఉండమంది. 'కాదంటే, నువ్వు నీతిమాలినదానివని నీ జాతి అంతా నిన్ను వెలివేస్తుంది. చుట్టూఉన్న తుంటరులకు నీ ఒంటరి బ్రతుకును బలి చేస్తుంది. జాగ్రత్త సుమా' అని హెచ్చరించింది.

పొద్దున లేచినప్పటినుంచీ ఈ ఆడంగు లంతా సమానత్వం అంటూ, వేదిక లెక్కి, పిడికిలి పైకెత్తి, ఎలుగెత్తి అరుస్తుంటే, వీళ్ళెంత అవివేకులో అని పిస్తుంది. ఇప్పుడు సమానత్వం లేదా? అర్హత ఉన్నవాళ్ళకు ఎప్పుడూ ఉన్నది గదా. వ్యక్తిగత స్వేచ్ఛ, సమానత్వం అనేవి ధైర్యసాహసాలు లాగా మనకు మనం వెంట తెచ్చుకోవాలిగాని ఒకరిస్తే పుచ్చుకునేవా అవి?

కృష్ణమోహనరావుతో తను సమానం కాదా? అందంలో, చదువులో, సంపాదనలో తెలివితేటల్లో అన్నిట్లోనూ ఆయనకన్నా తాను అధికురాలు. అయినా ఆయన ముందు తనెందుకింత నిస్సహాయురాలై పోయింది? ఆయన వ్యాపారస్తుడు గనుక, మోసం చెయ్య గలిగితే మాత్రం తను జాగ్రత్తపడవద్దా? [illegible] తర్వాత ఆయనతో సరిపడ లేదు. రాజీ పట్టుకుని ముందుకుపడితే

ఎవరినితిట్టాలిఃరాయినాఆ దారినా,మంద గించిన తన ముందుచూపునా ?

గిట్టలేదు కదాని కట్టుకున్న భర్తను, కట్టుకున్న బట్టను విడిచేసినంత తేలిగ్గా విడిచేసి, తేలిగ్గా గాలిపీల్చుకోగలిగిన సమాజం కాదుగదా మనది. అప్పుడుండే ఇబ్బందులు అప్పుడూ అంటాయి మరి.

ఆయన తన ప్రథమ కళత్ర పుత్రికా రత్నాన్ని తెచ్చిపెట్టి, దాన్ని తన కన్నబిడ్డగా భావించుకుని పెంచి పెద్దజేసి మనవళ్లనూ, మునిమనవళ్లనూ ఎత్తుకుని, హృదయానికి హత్తుకుని తరించమన్నాడు. ఈ అవమానాన్ని సహించటం ఎట్లాగని పొట్టగిత్తలా మనసెంత ఎదురు తిరిగినా, రాద్ధాంతం చేసి సాధించే సుఖశాంతు లేమీలేవు గనుక గతిలేక ఖర్మసిద్ధాంతాన్ని తల్చు కుంటూ కూర్చుంది. ఆ పిల్లకు తనపొడ గిట్టదు. ఈ ఇంట్లో తామిద్దరూ ఒకే ఒరలోనున్న రెండు కత్తుల్లా ఉన్నారు.

ఈ పిల్లనీ, దీని అబ్బనీ తోలు బొమ్మల్లాచేసి, వెనకనుంచి తాళ్ళు లాగుతూ తన ఇష్టంవచ్చినట్లు ఆడి స్తున్నది, నాయకురాలు నాగమ్మలాంటి దీని అమ్మ.

ఆమెకున్న జాగర్తలో వందోవంతు తనకు ఉంటే, ఈ కథ ఇంకొక రకంగా ఉండేది. కృష్ణమోహనరావును ఆరంభంలో లాగానే, వదలకుండా తన పరిరంభంలోనే బంధించి ఉంటే ఎలా ఉండేది ? ఆవిడా, ఆమె పిల్లలూ వాళ్ళ పంచకిందా, వీళ్ల చూరుకిందా చేరి అంట్ల గిన్నెలు తోముతూ, ఎంగిలిమెతుకులు కెలుకుతూ ఉండేవాళ్ళు. తనది జాలి గుండె కాబట్టి "అయ్యో పాపం" అను కుంది. అలా అనుకుని ఆయన్ని తిరిగి వాళ్లదగ్గరికి వెళ్లనివ్వటమే తాను చేసిన పాపం అయింది.

భర్తనుంచి తాను ఆశించిన సుఖ శాంతులు అంతగా లేకపోయినా, పోనీ ఒకరిద్దరు పిల్లలయినా కలిగితే, వాళ్లను చూసుకుంటూనయినా బ్రతుకుదామను కుంటే, ఆ ఆశా నిరాశేచేసింది నాగమ్మ. తనకు సంతానం కలిగితే, దాన్నీ, దాని పిల్లల్ని చూడదేమోనని కుశంకలు పెంచుకుని, ఆయన్ని మభ్యపెట్టి, బల వంతపెట్టి, ఆయన కింక పిల్లలు కలగ కుండా ఆపరేషను చేయించింది. ఇది తన కడుపులో చిచ్చుపెట్టటం కాదా ?

నాగమ్మగారి పథకం ప్రకారం కొన్నాళ్ళు పొయ్యాక, ఆయన ఈ కొరకరాని కొయ్యనుతెచ్చి, తనకిచ్చి "దీనికి నీవు తల్లివి" అన్నాడు.

తను తల్లిలాంటిదన్న భావన దానికీ లేదు. అది కూతురులాంటిదన్న ఆలో చన తనకూ రాదు. కడుపులో లేనిది కావలించుకుంటే వస్తుందా ? ఏమో, మగవాణ్ణి కావలించుకుంటే, ఎన్నాటి కయినా కడుపొస్తుందేమోగాని, ఆడ దాన్ని మరో ఆడది కావలించుకుంటే




చెమటకంపు తప్ప మరేమీ రాదు. ఈ మాత్రం గూడా ఆయనకి తెలియదా ? ఇంతకీ ఇదంతా తన ఖర్మ.

నిర్మలకు మళ్ళీ ఆకలి గుర్తొచ్చింది. గొంతు తడారిపోయింది. పొడిగా దగ్గువచ్చింది. ఓపికతెచ్చుకుని నెమ్మదిగా లేచి, గదిలోని లైటువేసింది. వంటింటి తలుపుతీసి లోపలికి నడిచింది. కూజాలోని నీళ్ళు రెండు గ్లాసులు గడగడా తాగి చుట్టూచూసింది. టేబులు మీద అన్నం, కూరా ఉన్న గిన్నెలు ఉన్నాయి. అటూ, ఇటూ రెండు కంచాలు, మధ్యలో మంచినీళ్ల జగ్, రెండు గ్లాసులూ ... అన్నం గిన్నెమీద మూత మూషికరాజులు తీసి చూసినట్లున్నారు అప్పడాలు. వడియాలూ చవి చూడాలని చూసినట్లున్నారు. పళ్లెం పక్కన పడున్నయి. అవన్నీ సర్దుతూ, అపర్ణ తినే కంచంవైపు చూసింది. తళతళామెరుస్తున్న ఆ పళ్లెంలో ఒక సాలెపురుగు ప్రాకుతోంది. దానికోసం కాబోలు బల్లి గోడమీద కాపువేసింది ఈ పురుగు చూడకుండా తిండిలో కలిసిపోతే, ప్రాణానికేమన్నా ముప్పా ? ఏమో...

ఖర్మకొద్దీ ఇలాంటి దేమన్నా జరిగితే, తనే గిట్టక చంపిందని నలుగురూ అనరూ ? ఆయనమాత్రం ఊరుకుంటాడా ? నాయకురాలు నాగమ్మ తనని బ్రతకనిస్తుందా ?

కంచాలు కడిగి బోర్లించి, మళ్ళీ ముందుగదిలోకి పచ్చింది. ఇంకా చినుకులు రాలుతూనే ఉన్నాయిగాని, ఇందాకటి అంతటి ఉధృతం లేదు.

చల్లగాలి రయ్యమని వీస్తుంటే. బాల్కనీ పిట్టగోడదాకా వచ్చి వీధి

చివరిదాకా చూస్తూ నిలబడింది. ఇది ఎంతకీ రాదేమిటి ? ... ఎక్కడ, ఎవడితో ... దీని కెవరు కాపలా కాయ గలరు ? ఇంతకీ దాన్ని ఇక్కడ ఉంచటంలో ఆయన ఆంతర్యం, దానికి తను కాపలా కాయాలనా, తనకు అది కాపలా కాయాలనా ? అసలు మనసు అవినీతివైపు మొగ్గకుండా ఎవరికివాళ్ళే జాగ్రత్తపడాలిగాని, మరొకరు పట్టి లాగితే ఆగుతారా ? అవినీతినుంచి నీతికి, అంటే దిగువనుంచి ఎగువకు ప్రాకటం కష్టంగాని, పైనుంచి క్రిందకు జారటం ఎంతో తేలిక. పైగా పిల్లలకు అదెంతో సరదాగా గూడా ఉంటుంది.

రోడ్డుమీద వర్షంనీరు గూడా ఎగువ నుంచి దిగువకు దూకుడుగా పారు తోంది, గలగలలాడుతూ. ఊరంతా నిర్మానుష్యంగా ఉంది. లోకమంతా నిద్దరమత్తులో ఉంది. వీధి దీపాలు నడుం వంగిన వయోవృద్ధుల్లా ఉన్నాయి. వాటి వెలుతురు చత్వారం వాడిచూపులా నేలమీదకు ఆనీ ఆనకుండా ఉంది.

పారే ఏరులా ఉన్న నీటిని చిమ్ము కుంటూ తన ఇంటిముందుకు వచ్చి ఆగిందో టాక్సీ. దానిలోనుంచి అపర్ణ దిగింది. ఆందులోనున్న పరపురుష డెవడో వీడ్కోలుగా చెయ్యి ఊపాడు.

వాడికి టాటా చెప్పి ఇది పైకి వస్తుం డగా, టాక్సీ వెనక్కి మళ్ళిపోయింది. మెట్లెక్కి వచ్చి అపర్ణ నిర్మలవంక ఒక సారి నిరసనగా చూసి, విసురుగా తల ఎగరేసి లోపలికి వెళ్ళిపోయింది. బట్టలు మార్చుకుని బాత్‌రూంలోకి వెళ్ళి మొహంకడుక్కుని వచ్చింది. టవల్‌తో తుడుచుకుని, అద్దంలో చూసుకుంటుంటే వెనకనుంచి నిర్మల అడిగింది చాలా సౌమ్యంగా.

"ఎవడు వాడు ?"

"...ఫ్రెండ్..." ముక్తసరిగా బదులు చెప్పి ఊరుకుంది అపర్ణ.

"ఇప్పటిదాకా ఏంచేస్తున్నారు ?"

"పిక్చర్ కెళ్లాం..."

నిర్మల కాసేపు మౌనంగా ఊరు కుంది. అపర్ణ అద్దం ముందునుంచి కదిలి, తుండుగుడ్డ దండెంమీద ఆరేసి వచ్చి మంచంమీద కూర్చుంది.

"ఇప్పుడు టైం ఎంతయిందో తెలుసా ?" అని అడిగింది నిర్మల.

అపర్ణ ఒకసారి క్రోధంగా చూసి ముహం చిట్లించుకుంది. నోరు మెదప లేదు.

"నిన్నే అడిగేది ?" అని రెట్టిం చింది నిర్మల. దాంతో "కంయ్" మని మీద పడ్డది అపర్ణ.

''నన్ను అడగటం ఎందుకు ? నీకు టైం ఎంతయిందో తెల్సుకోవాలంటే వాచీ చూసుకో."

"నేను చూసుకుంటూనే ఉన్నాను. నువ్వు ఎంతసేపటిదాకా ఎక్కడెక్కడ తిరుగుతున్నావో చూసుకుంటున్నావా

అని ?" నిర్మల గూడా స్వరం పెంచింది.

"నువ్వు నాకేం చెప్పక్కర్లా. నా కన్నీ తెల్సు."

"నా కన్నీ తెల్సు అనేవాళ్ళకు ఏమీ తెలీదు అని అర్థం."

"నువ్వు నాకేం పాఠాలు చెప్పక్కర్లా."

"నీకు పాఠాలు చెప్పమనే, చెప్పించమనే మీ నాన్న నిన్ను ఇక్కడ పెట్టి వెళ్ళాడు! అర్ధరాత్రి దాటేదాకా ఈ తిరుగుళ్లేమిటి ! ఎక్కడికెళ్ళావు ? ఏం చేస్తున్నావు ? చెప్పు..."

"పార్టీ..."

"ఏమిటీ ?"

"కొంతమంది ఫ్రెండ్స్ కల్సి ఒక గొలుసు నవల రాశాం. అది అచ్చవబోతోంది. మేం అంతా కల్సి ఇవాళ పార్టీ చేసుకున్నాం. అన్నపూర్ణాలో భోంచేసి, రామకృష్ణలో సెకండ్‌షోకి వెళ్లాం. చాలా. ఇంకా ఏమన్నా కావాలా ?" అన్నది అపర్ణ రోషంగా చూస్తూ.

నిర్మల పోతున్న సహనాన్ని పిల్చి తోడుతెచ్చుకుని, నెమ్మదిగా చెప్పింది.

"చూడు అపర్ణా, ఇప్పుడు నువ్వు యవ్వనారంభావేళలో న్నావు. పాల పొంగులాంటి పయసు తరుముకుంటూ వెళ్తుంటే, పర్యవసానాలను గురించి ఆలోచించుకునే తీరికా, ఓపికా ఉండని రోజులివి. కానీ ఇప్పుడు కుదురుగా నడవకపోతే, తొందరపడితే, ముందుకు పడితే, జీవితంలో ఇంక లేవలేవు. చేయూతనిచ్చి, లేవదీసి, వెంట నడిపించుకుని తీసుకు వెళ్ళేవాళ్ళు ఉండరు. అంతదాకా వచ్చాక, కన్న వాళ్ళు గూడా ఎవరి ఖర్మ వాళ్ళదని వదిలేసి ఊరుకుంటారు..."

"నేనేం చేశానిప్పుడు ?"

"చేశాక, ఇంక మనం చెప్పటానికి, నోరువిప్పి చెప్పుకోవటానికి ఏమీ ఉండదు. మనం ఎవరికీ ఏమీ చెప్పకపోయినా, అప్పుడు లోకమంతా మన గురించే చెప్పుకుంటుంది"

"అంతా నీ లాగే ఉండరు" ఆ మాట కొరడా దెబ్బలా తగిలింది నిర్మలకు.

నిర్మల ఉలిక్కిపడ్డది. అయినా ఇలాంటి వన్నీ అలవాటే గనుక వెంటనే తమాయించుకుని, ఇంకా శాంతంగానే అన్నది.

"నాలా ఎవరూ ఉండకూడదనే కోరుకుంటున్నాను తల్లీ. నేనొక శాపగ్రస్తురాల్ని. నన్నిలా ఉండమని శపించింది మీ నాన్న. అయినా, నేను మీ అందరి బాగుకోసమే తపించిపోతున్నాను. కానీ నేను మీకు గర్భశత్రువులా కనబడుతున్నాను. దీని కంతటికీ కారణం ఏమిటని ఇప్పుడు ఆలోచిస్తే, అదుగో అప్పుడు

ఆలోచించకుండా అలా చేసుకోవటం వల్లనేనని..."

"ఇష్టంలేకపోతే వెళ్ళిపోవచ్చుగా. మమ్మల్ని పట్టుకుని వేళ్ళాడ్డం ఎందుకూ?" అన్నది అపర్ణ మంచం మీద వెనక్కివాలి పడుకుంటూ.

ఆ మాటతో నిర్మలకు సహనం చచ్చిపోయింది. కోపం హెచ్చిపోయింది. "ఎందుకా? ఎందుకంటే నీలా నాకింత గడ్డిపెట్టే వాళ్లెవరూ లేరని, మిమ్మల్ని పట్టుకుని దేవుళ్ళాడుతున్నానే పాపిష్టి ముండా?"

అపర్ణ చట్టున లేచి కూర్చున్నది. "ఏవమ్మోవ్, మాటలు జాగర్తగా రానీ. ముండా, గిండా అన్నావంటే మర్యాదగా ఉండదు ఇంకా నువ్వే మా నాన్నకు ముం..."

"నోర్ముయ్. విశ్వాసఘాతకురాలా. నీ కోసం, నీ యబ్బకోసం, నేను పరువూ, మర్యాదా, సిగ్గూ, అభిమానం అన్నీ విడిచేసి తిరుగుతున్నానే. నేనే గనక తల్చుకుంటే మిమ్మల్ని అందర్నీ నిలవనీడలేకుండా చేసి, చెట్టు కింద కాపరం పెట్టించేదాన్ని. నా మంచితనం మీకు చేతగానితనంగా కనపడుతోంది. రేపట్నించీ చూపిస్తాను నా తడాఖా..."

"ఏం చేస్తావేంటి?"

"ఏమైనా చేస్తాను, ముందు నీ భాగోతమంతా మీ నాన్నకు చెప్తాను".

"నీ భాగోతం నేనూ చెప్తాను."

"ఏమిటే నా భాగోతం?" అని గదిస్తూ ముందుకొచ్చింది నిర్మల.

"నా భాగోతం ఏమిటీ" అని రెట్టించింది అపర్ణ।

"అర్ధరాత్రి దాటాక టాక్సీలో తీసకొచ్చి దించుతున్న వాడెవడే? నీకేమవుతాడే? ఫ్రెండ్ ట ఫ్రెండ్ ... బోడి ఫ్రెండ్."

"నా యిష్టం నువ్వు అనవసరంగా మాటలంటే పడి ఉండేవాళ్ళెవరూ లేరిక్కడ."

"పడి ఉండకపోతే పోవే నీ యిష్టం వచ్చిన వాడితో లేచి పో."

"పోతాను. ఇప్పుడే పోతాను. నీచేత ఈ మాటలు పడటంకన్నా, హుస్సేన్ సాగర్‌లో దూకిచస్తే నయం" అని లేచి విసురుగా వెళ్ళిపోతున్న అపర్ణ వెంట పడి వాకిలిదాకా దాదాపు పరుగెత్తుకుని వెళ్ళి, చెయ్యిపట్టుకుని బలవంతంగా వెనక్కిలాక్కొచ్చి, విసురుగా మంచం మీదకు తోసేసింది నిర్మల.

"కదిలావంటే చంపేస్తాను. నోరు మూసుకు పడుండు. ఈ అర్ధరాత్రి నువ్వెందులోనన్నా దూకి చస్తే, పోలీసులు నన్ను చంపుకుతింటారు. నీకు ఇష్టంలేకపోతే, మీ నాన్నను పిలిపిస్తాను. నే చెప్పేది నే చెప్తాను. నువ్వు చెప్పేది నువ్వూ చెప్పు. ఆ తర్వాత ఆయనా, నువ్వూ పోయి ఏ గంగలో నన్నా దూకండి. నాకేం పట్టదు..."

అపర్ణ మంచంమీద బొక్కబోర్లా పడి వెక్కివెక్కి ఏడుస్తూ, మధ్యమధ్య చీదేస్తూ, కాసేపటికి నెమ్మదిగా కునుకేస్తూ, లేస్తూ, మళ్ళీ రోదిస్తూ రాత్రంగా గడిపేసింది.

నిర్మల తలుపుగడియవేసి, గుమ్మానికి అడ్డంగా తన కుర్చీవేసుకుని కూర్చుని, అందులోనే కునికిపాట్లు పడుతూ ఆ రాత్రంతా గడిపేసింది.

తెల్లారి లేచాక మళ్ళీ ఎవరి పనుల్లో వాళ్ళు మునిగిపోయినారు. నిర్మల కాలేజీకి వెళ్ళింది అపర్ణ గూడా పుస్తకాలు పుచ్చుకుని రోజూలాగానే ఇల్లు వదిలి వెళ్ళింది.

ఆ తర్వాత రెండురోజులు గడిచినా అపర్ణ ఇంటి ముఖం చూడలేదు. నిర్మల ముఖం పెంకులా మాడిపోయింది. ఆమె గాభరాపడింది. కంగారు ఎక్కువైంది. వెతుకుదామంటే, ఆ పిల్లకు స్నేహితులెవరెవరో, ఎక్కడున్నారో గూడా నిర్మలకు తెలియదు స్కూల్లో కనుక్కుంటే అక్కడికి రాలేదని చెప్పారు.

క్లుప్తంగా విషయం తెలియజేస్తూ వెంటనే బయల్దేరి రమ్మని కృష్ణమోహనరావుకి టెలిగ్రాం ఇచ్చింది.

ఆయన రావటం రావటమే నిప్పులు కురిపిస్తూను, చిందులు తొక్కుతూనూ వచ్చాడు.

"దాన్ని ఏం చేశావు నువ్వు ? నిజం చెప్పు..." అని దండించాడు.

"నేనేమీ చెయ్యలేదు. అర్ధరాత్రిళ్ల కొంపజేరుతుంటే, ఇలాగయితే నా దగ్గర ఉండొద్దన్నాను ఆ మాత్రానికే దానికి పౌరుషం పొడుచుకొచ్చింది" అని వివరించబోయింది నిర్మల ఆయనకు వినే ఓపిక లేకుండా ఉంది. చిటపటలాడుతున్నాడు.

"అది పసిపిల్ల. దానికి తెలియక ఏదన్నా తప్పుచేస్తేమాత్రం నువ్వు చెప్పే విధంగా చెప్పాలిగాని, దాన్ని బెదగొట్టింది చాలక, ఇల్లు వెళ్ళగొదతావా ?"

"అదుగో ఆ మాటే అనొద్దు నేను నీ కోసం, నీ పిల్లలకోసం ఏంచేసినా, అది నాకే ఎదురు తిరిగి కొడుతోంది. నీకో నమస్కారం పెడతాను. నన్నిలా వదిలేసి పొండి." అని తప్మని శబ్దం చేస్తూ రెండుచేతులూ మ్రోగించింది.

"ఏం వాళ్ళు ఎలా ఉందే ? కట్టుకున్నవాణ్ణి పొమ్మని ఏం చేద్దామని ?"

"వంగంలో దూకుదామని. నిన్ను కట్టుకున్నప్పుడు గూడా తెలియకుండా నే చేసిన పని అదే. నివ్వింతలా తడిగుడ్డతో గొంతులు కోసే రకమని తెలియక..."

ఆ మాటతో కృష్ణమోహనరావు ఆవేశాన్ని పట్టలేకపోయినాడు ఛెళ్ళుమని నిర్మల చెంపమీద కొట్టాడు. మునిపంటితో క్రింది పెదవిని నొక్కిపెట్టి దుఃఖం అపుకుంటున్న ఆమెకు ఆ దెబ్బతో దిమ్మ తిరిగిపోయింది. క్రింది పెదవికి పైపన్ను గుచ్చుకుని నెత్తురు చిమ్మింది. అరచేత్తో పెదవిని తుడుచుకుని, రక్తాన్ని చూసుకునేటప్పటికి, నిర్మల గుండెల్లో కోపం రెల్లుగడ్డిలా భగ్గున మండింది. ఆమె అహం గుండు దెబ్బతిన్న సింహంలా ఎదురు తిరిగింది.

"నన్ను కొడతావా నువ్వు? ఎక్కడిది నీకీ హక్కు?" కాళికాదేవిలా మారి కళ్ళల్లోనుంచి నిప్పుల వర్షం కరిపించింది, ఎప్పుడూ నిండుకుండలా నిర్మలంగా ఉండే నిర్మల

"భార్య భర్తకు అణిగి మణిగి ఉండాలి లేకపోతే సామ దాన భేద దండోపాయాలు ఉండనే ఉన్నాయి..." అని తనను తాను సమర్థించుకోబోయి నాడు కృష్ణమోహనరావు

"నన్ను దావగొట్టే మొగాడు దొరకడనా నిన్ను కోరి చేసుకుంది? భార్య మెళ్లో తాళిగట్టటానికీ, గొర్రె మెడలో తాడుకట్టటానికీ తేడా లేదనుకునే నిన్ను గుడ్డిగా వరించటం నాదే పొరపాటు పసుపుతాడు కంఠానికి బిగించి, రోజు రోజూకూ బిగించి లాగుతూ దాన్నే ఉరి తాడుగా మార్చిన నువ్వు నాకు భర్తవెలా అవుతావు? నువ్వు నా శత్రువ్వి ద్రోహివి నీచుడవు..."

కృష్ణమోహనరావు క్షణకాలం దిగ్భ్రమచెంది నిరుత్తరుడై నాకు తమాయించుకుని ఇంక రాజీమార్గానికి రావాలనుకున్నాడు

"నిర్మలా నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుస్తోందా? నువ్వు కోపంతో కాదన్నంత మాత్రాన చెరిగిపొయ్యేదికాదు మన సంబంధం భార్యాభర్తల అనుబంధం, జన్మ జన్మల బంధం...''

"నీ బొంద బంధం గెటవుట్... ఇంకా ఇక్కడే తగలడావేం? పో... పొమ్మంటుంటే..." వర్షించే మేఘంలా ఏడుస్తూనే ఉంది, గర్జిస్తూనే ఉంది

"హుఁ, నన్నుకాదని నువ్వెలా బ్రతుకుతావో అదీ చూస్తాను'' అంటూ కృష్ణమోహనరావు రోషంగా బుసకొట్టి, పెద్ద పెద్ద అంగలతో అక్కడినుంచి వెళ్ళిపోయినాడు

ఇన్నేళ్ళ జీవితంలో ఎన్నడూ ఒకరి చేత ఒకమాట చెప్పించుకోవటం ఎరుగని నిర్మల, ఈ కృష్ణమోహనరావు చేతిలో దాపుదెబ్బతిన్నది ఆ నిస్తేజంలో నుంచి తేరుకోకముందే, పక్కవాటాలోని కరుణాకరం వచ్చి పలకరించాడు

"ఏమిటి నిర్మలగారూ, ఏదో గొడవ పడుతున్నట్లున్నారు...అరెరె, ఆ రక్తం ఏమిటి?" అంటూ చొరవగా దగ్గరకి రాబోయినాడు

"నాకేం ఫర్వాలేదు దయచేసి నన్నిలా వదిలెయ్యండి మీకో నమస్కారం పెడతాను'' అంటూ దాదాపు అతన్ని బయటికి గెంజేసి, ధన్‌మని తలుపుమూసేసింది

నిర్మల పరుపుమీద పడిపోయి, బాణందెబ్బతిని రక్తాన్ని స్రవిస్తున్న నెమలిలా, కళ్ళల్లోనుంచి నెత్తుటి కన్నీటిని బొట బొట కారుస్తున్నది

కిటికీలోనుంచి విసురుగా లోపలికి దూసుకొచ్చి, మొరటుగా మీదబడి జుట్టును చెదరగొడుతూ, ఒంటిమీద బట్టల్ని ఎగరగొడుతున్నది హోరు గాలి

ఎవరికింక జాలి





# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

అవసరాల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

## 9

అనుకున్నట్టు ఆ తర్వాతి ఆదివారం యాలిస్ ప్రశాంతి గారింటికైతే వెళ్ళలేదుగాని వాళ్ళిద్దరి పరిచయమూ క్రమక్రమంగా ఎక్కువైంది

మొట్టమొదట్లో ప్రశాంతి పిల్లలకు ట్యూషన్ చెప్పడంతో ఆ ఇంటితో పరిచయం అయింది యాలిస్‌కి తనెంత ముభావంగా ఉందామని ప్రయత్నించినా, వాళ్ళింట్లో ప్రతి ఒక్కరూ తన మీద చూపించే ప్రేమా ఆసక్తీ పోల్చుకున్న యాలిస్ వారికి మరింత సన్నిహిత మయ్యేదే. కాని ఆనాటి పార్కులోని ప్రభుదాసు చర్యతో ఆ కుటుంబంతో తనకి ఓ విధమైన విముఖత లాంటిది ఏర్పడక తప్పలేదు కృపానంద్ ఒంట్లో బాగులేదని ఓ మాటూ, ప్రశాంతికి కొత్తగా పుట్టిన పాపని చూద్దామని ఓ మారూ - ఇలా ఈ మూడూ నాలుగేళ్ళలో మహా అయితే ఏ అయిదారుసార్లో వెళ్ళిందేమో వాళ్ళింటికి ఇంచుమించు రెండ్రోజుల కోమారు తమ ఇంటికి వచ్చే కృపానంద్‌ద్వారా వాళ్ళ కబుర్లు ఎప్పటికప్పుడు తెలిసేవి తక్కిన వాళ్లెవరూ సర్వసాధారణంగా ఇటువైపు వచ్చేవారుకారు ప్రభుదాసుకి కూడా రెండేళ్ళై, ఏదో దగ్గర పల్లెటూర్లో కొత్తగా ఓపెన్ చేసిన బ్యాంకులో ఉద్యోగం అయిందిట. స్కూటరుమీద వెళ్ళి వస్తున్నాట్ట ...

తనకీ ప్రభుకీ మధ్య నడిచిన మరి రెండు సంఘటనలు కూడా యాలిన్ ఎప్పుడూ మరచిపోలేదు

ఓ నాటి శనివారం మధ్యాహ్నం యాలిన్ ఇంటికి వచ్చేవేళకు దయామయి ఇంకా రాలేదు మరియమ్మ కూడా పెద్దింట్లోనే ఉంది.

స్కూటర్ ఆగిన చప్పుడు వినిపించి యాలిన్ ఇవతలి కొచ్చింది మలచిన మగతనంలా నిండుగా నిలువెత్తుగా ఉన్న ఆ స్వరూపాన్ని చూడగానే ఆమెకి భయంతోపాటు ఆశ్చర్యం కూడా కలిగింది.

"నే నెంత మీకు కానివాణ్ణయినా మీరు బతికున్నంతకాలం జ్ఞాపకం పెట్టుకునేంత తప్పుపని ఏమీ చెయ్యలేదనుకుంటాను. నిలుచున్నవాడిని లోపలికి పిల్చి కూర్చోమనే కనీస మర్యాదకైనా నేను నోచుకోనా ?"

యాలిన్ నాలిక కరుచుకుంది

"క్షమించండి ఇప్పుడే వచ్చాను, ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాను... ఇలా వరండా మీదికి రండి. ఈ సోఫామీద కూచోండి ఫేన్ తగుల్తోందా సరిగ్గా ? బల్లమీద మేగ్జైన్సు ఉన్నాయి చూస్తూండండి గడియలో టీ కలుపుకు వస్తాను "

"నా కోసం అంత శ్రమెందుకు ?"

"కనీసం నా కోసమయినా తప్పదుగా ; తేనివ్వండి "

"ఇల్లాంటి ఫార్మాలిటీస్ తర్వాత చూసుకుందాం ముఖ్యంగా మరెవరూ రాకుండా నే చెప్పే నాలుగుముక్కలూ చెప్పనివ్వండి ఇలా నా ఎదుట వచ్చి కూచోండి "

యాలిన్ కూచోలేదు తల కిందికి దించుకుని నేలని వ్రేలితో రాస్తూ 'చెప్పండి అంది నెమ్మదిగా '

"మీరు మా మావయ్య కృపానంద్‌తో ఫ్రీగా మాట్లాడతారు ఆఖరికి మొన్న డాలీని చూడ్డానికి మా యింటికి వచ్చినప్పుడు మా అన్నయ్యను సహా పలకరించారని వదిన చెప్పింది మీరు మా యింటికి రావడమే అరుదు వచ్చినా నేను లేకుండా చూసుకునే వస్తారు కర్మంకాలి నేను ఇంట్లో చిక్కుకుపోతే పొరపాటునయినా అటువైపు తొంగి చూడరు అన్నాళ్ళై జరిగినా ఆ పార్కు సంఘటన ఇంకా మీరు మరచిపోలేదా, నా మీద మీ కింకా కోపం పోలేదా ?"

యాలిన్‌కి ఏం చెప్పాలో తోచలేదు.

"జీవితంలో స్థిరపడిన మొగాడికి రెండు అయితే బాగుణ్ణని అతనేగాక వాళ్ళ వాళ్ళందరూ కూడా చూస్తారు ఒకటి ఉద్యోగం నాకు మంచి ఉద్యోగం దొరికిందని మీకు తెలుసు ఇక రెండోది ఏమిటో మీరు ఊహించలేనిది మాత్రం కాదు ;"

ప్రభూ నవ్వుతూ ఆమెవైపు

చూశాడు ఆమె కా నవ్వేం నచ్చలేదు. పైగా చిరుచెమటలు కమ్ముకొచ్చేయి

తన గత చరిత్ర అంతా దయామయి ద్వారా కృపానంద్ కుటుంబ సభ్యులం దరితోపాటు ఇతను కూడా విన్నాడు

అయినా ఎందుకొచ్చేడు ?

ఎవరూలేని సమయం కనిపెట్టి ఏదో పూర్వ పరిచయం పురస్కరించుకుని లోపలికి జొరబడి పలకరిస్తున్నాడు, దేనికోసమని ?

తను స్కూలుకి వెడుతూంటే వెంట బడే వెకిలి కుర్రాళ్ళ వెర్రివేషాలు గుర్తొచ్చాయి యాలిస్‌కి ఇలాంటి కుర్రాళ్ళందరికీ గురువులాంటి సుదన్ తనకు చేసిన అన్యాయం చాలు ఆ మహాను భావుడికి సాక్షాత్తూ ప్రియశిష్యుడు కాదా ఈ ప్రభుదాసు ! ఛ, ఏం మగజాతి !

యాలిస్ గదికి గొళ్లెంపెట్టి మెట్లుదిగి త్వరత్వరగా క్రిందికి వచ్చేసింది

"మదర్ పాలు కాచి ఉంచమన్నారు మాటల్లోపడి ఆ మాటే మరచిపోయాను. మరియమ్మ పాలు పోయించుకుందో లేదో - కనుక్కు వస్తానుండండి" అని 'ఇదిగో యాలిస్ ప్లీజ్ లిజెన్ టు మి' అని ప్రభూ పిలుస్తున్నా వినిపించుకో కుండా మెయిన్ బిల్డింగ్‌వైపు దారి తీసింది స్కూటర్ స్టార్ట్ చేసిన చప్పుడూ - అది దూరమయిన చప్పుడూ వినిపించేదాకా తను మరి వెనుదిరగలేదు

ఆ తర్వాత నెల్లాళ్ళు గడిచిన నాటి సంగతి ప్రభుదాసు తన క్లోజ్ ఫ్రెండ్ కిరణ్‌ని యాలిస్ దగ్గరకి పంపించాడు తను పిల్లలకి ట్యూషన్ చెప్పే రోజుల్లో చాలా మార్లు కిరణ్‌ని కృపానంద్‌గారి యింట్లో చూసింది తనకి ఆలస్యమై పోతే అప్పుడప్పుడు రిక్షా అదీ పిలిపించి సాయంచేసేవాడు కూడా.

ఆ ఆదివారం పగటి భోజనం అయాక తనలా బజారు కెళ్ళి వస్తూంటే కిరణ్ పలకరించాడు యాలిస్ మామూలుగా యోగక్షేమాలు అడిగింది

"ప్రభుదాసు మిమ్మల్ని ఓ విషయం కనుక్కురమ్మన్నాడు, అభ్యంతరం లేకపోతే చెబుతారా ?"

యాలిస్ ఆగి అటూ ఇటూ చూసింది అదృష్టవశాత్తూ ఆ వేళప్పుడు ఆ ప్రాంతంలో అట్టేమంది జనంలేరు ఉన్నవాళ్ళు ఎవరి పనిలో వాళ్ళు లీనమై ఉన్నారు

"వాడూ నేనూ, బీకాం దాకా కలసి చదువుకున్నాం తర్వాత వాడు ఎం కామ్ లో చేరేడు నేను లా చదివేను ఇప్పుడు వాడు బ్యాంకు జాబ్ చేస్తున్నా - నేను బోర్డుకట్టి ప్రాక్టీస్ చేస్తున్నా జీవన విధానాలు వేరుగాని మా ప్రాణాలు మాత్రం ఒకటే. రోజుకి ఓ సారైనా కలుసుకోందే మేం ఉండ లేము..."

"అంత స్నేహమా మీ ఇద్దరికీ ?"

"అవును అందుకనే ఈ కబురు మీ చెవిన వెయ్యమని నన్ను పంపింది "

"మీ కంత శ్రమ అక్కర్లేకుండా - మళ్ళీ మీ ఫ్రెండు ఇలాంటి వెర్రి వెర్రి వేషాలు వెయ్యకుండా నేనే ఓ మాట చెప్తాను, సరిగ్గా జ్ఞాపక ముంచుకుని అతన్తో చెప్పండి "

"అయ్యయ్యో ... మా ప్రభూ మీరు అనుకున్నలాటి వాడుకాదు...

"...ఈ యాలిస్ కూడా తను అనుకున్న వ్యక్తిలాంటిది కాదనీ, అంత సులువుగా తన చేతికి చిక్కదనీ, మరెప్పుడూ ఇలాంటి రాయబారాలు నడపొద్దనీ నా మాటగా చెప్పండి నా మీద నిజంగా అభిమానం లాంటిదే ఉంటే నన్నిలా బతకనియ్యమని చెప్పండి - అంతే చాలు ।"

ఒక్క నమస్కారం చేసి యాలిస్ వెళ్ళిపోజూచినా కిరణ్ దారి ఇవ్వలేదు

"మాడండి పట్టణంలో పట్టపగలు మార్కెట్‌లో ఉన్నాం మనం ... నే నొక్క కేకేస్తే చాలు. "

"మీరు ఎంతకైనా తగుదురనీ, ఎదుటివార్ని చెప్పుకోడానికైనా అవకాశ మియ్యనంత మొండి ఘటమనీ ఎప్పుడో గ్రహించాము అందుకే ఎందుకైనా మంచిదని చిన్న చీటీ కూడా పంపించాడు ప్రభూ ఇదిగో, చింపి ఇంతింత ముక్కలు చేస్తారో... చదివి ఓ నిమిష మైనా దీని గురించి ఆలోచిస్తారో!" జేబు లోంచి చిన్న కాగితం మడతతీసి - తను వారించే అవకాశమైనా ఇవ్వనంత తొందర్లో తన చేతిలోని సంచీలో పడేసి - గబగబా సైకిలెక్కి వెళ్ళి పోయాడు కిరణ్

కిరణ్‌కి ఏణ్ణర్థమైె పెళ్ళయింది తను పెళ్ళికి వెళ్ళింది కూడాను ఎన్నిసార్లో తమ ఇంటికి రమ్మని ఆహ్వానించాడు ఆ అమ్మాయిని ఓ సారి దయామయి గారింటికి తీసుకొచ్చి - తన కాటేజ్‌కి కూడా తీసుకువచ్చాడు ప్రస్తుతం పురిటికెళ్ళింది, ఆ అమ్మాయి వీళ్ళ అన్యోన్యత ఎంతో ముచ్చటగా ఉంటుంది కూడా ఓ వెకిలి చూపుగాని, తప్పుమాటగాని వెతికినా కనిపించవ్ అతనిలో. ప్రభూ అయితే బ్రహ్మచారి దేనికైనా తెగించాడనుకోవచ్చు కేవలం తనని ఏదో మాయోపాయం పన్ని, తన స్నేహితుడికి అప్పగించేటంతవరకు సిద్ధమయిపోతాడా యీ సామాన్య గృహస్థు ?

ఇలాంటి ఆలోచనలే యాలిస్‌ని ఆ చీటీ చింపకుండా చేశాయి ఇంటికి వెళ్ళగానే తలుపు గడియపెట్టి ఒణుకుతున్న చేతుల్తో యాలిస్ ఆ కాగితం మడతలు విప్పింది

డియర్ యాలిస్,

మిమ్మల్ని కలుసుకోడానికి నాకు నేనుగా చేసుకుంటున్న ఆఖరి ప్రయత్నం ఇది సాటి మనిషిమీద

ఏమాత్రం గౌరవమున్నా ఈ రెండు ముక్కలూ చదివి మరీ ఇది చింపెయ్యండి

మిమ్మల్ని ప్రేమించాను, ఆరాధించాను

మీ గత చరిత్ర తెలియగానే కొన్ని రోజులపాటు నేనూ విపరీతమైన మానసిక అలజడికి గురిఅయినమాట నిజమే

తర్వాత తర్వాత తేరుకున్నాను, నా తప్పు తెలుసుకున్నాను ఇవి కేవలం అక్షరాలు కావు, నా భావాలు మాత్రమే

మిమ్మల్ని స్వీకరించడానికి ఇప్పటికీ నేను సిద్ధంగానే ఉన్నాను మీరొకరికి శరీరం అర్పించారనీ, మీకు పుట్టిన కొడుకు పెరుగుతున్నాడనీ నాకు తెలీదా ? తెలుసు తెలిసినా మిమ్మల్ని పెళ్ళిచేసుకోడానికి సిద్ధంగా ఉన్నాను !...

యాలిస్ చేతిలో ఉత్తరం జారిపోయింది అలా కటిక నేలమీదికి దాన్ని జారనివ్వడం ఆమెకి సబబుగా తోచలేదు తీసి తలగడా కిందపెట్టింది మంచినీళ్లు తాగివచ్చింది పమిట చెంగుతో నుదుటిని తుడుచుకుంది మొదట్నుంచీ మళ్ళీ అంతా చదివింది...

ఆ తర్వాత ?

...అవును ... మీరు చేసిన తప్పేమిటని ! పుట్టుకతో అనాథ మీరు ఆశ్రమంలో లేళ్లమందలా పెరిగారు మీ ఆడవాళ్ళు ఆ శరణాలయంలో మీకేం తల్లా, తండ్రా ? ఎవరు శిక్షణ ఇచ్చారని ? ఏది మృదువైన ఆకో, ఏది పదునైన బాకో మీకెలా తెలుస్తుంది ! ప్రేమికుల సంరక్షణలో పెరిగి, చదువుకున్న వాళ్ళం, ముప్పై ఏళ్ల దగ్గర పడిన మాకే సరిగ్గా మంచి చెడ్డలు తెలీవే, ఆ పరిమిత వాతావరణంలో మీకేం తెలుస్తుందని ! నీరు పల్లంవైపే ప్రవహించినట్టు మీ కన్నీరు ఎప్పుడూ సాటిమనుషుల కష్టాలవైపే చిందితే అది మీ లోపమా ! జాలి అని ధూళిలో పడ్డారు తాత్కాలికంగా. మా అన్నయ్య కూతురు బేబీ ఇసకలో దొర్లి వస్తుంది ఆ నేరానికి దాన్ని వీధిలోకి గెంటేసి తలుపు వేసెయ్యమన్నారా !

ఇంతకన్న నా భావాలు వ్యక్తీకరించడం నాకు చేతకాదు ఈ నా భావాలకు మీ కళ్ళు చెమర్చడమేకాక, మీ గుండె కూడా ద్రవిస్తే నాకు కబురు పంపండి మీ కోసం ఎన్నేళ్లయినా నిరీక్షించగలను ప్రతిక్షణం కలుసుకుందామని కలవరిస్తున్న మీ కన్న కొడుకు కోసం మూడేళ్ల పైగా కలుసుకోడం వాయిదా వేశారు ఇంకో రెండేళ్లైనా ఉండగలనని నిశ్చయించుకున్నట్టు విన్నాను. మీ గురించి వింటూ తెలుసుకొంటూ కలలు కంటూ – మీ నిరీక్షణనీ పట్టుదలనీ చూసి మెచ్చుకోగలిగిన నేనేనా ఆ మాత్రం ఓర్చుకోలేనిది ?

మీకు మీరుగా వచ్చి పలకరిస్తేగాని పలకను అంతవరకూ అదెన్నాళ్లయినా సరే చిరునవ్వుతో వేచి ఉండేశక్తి, అది నేర్పింది కూడా మీరే !

మీ ప్రభుదాసు

ఆ రోజు మధ్యాహ్నం నుంచి సాయం కాలంవరకూ — లోపల గడియ వేసిన తలుపు వరి తీయకుండా అలా మంచంమీదే ఉండిపోయింది యాలిస్ జరిగిన ఒకే ఒక అన్యాయంతో మొత్తం మానవత్వంమీదే అపనమ్మకం పెంచు కున్న దౌర్భాగ్యురాలు తాను ఇంతగా ఊపిరి సలపనంతగా ఉక్కిరి బిక్కిరి చేసేటంతగా ప్రేమానురాగాలు అందు కోడానికి ఏం అర్హత మిగిలిందని తనకి ! ఎవరూ లేరనుకున్న జన్మ తనది ఎవరో తెలీనివాడిచేత మోస గించబడి విధిచేత ఎక్కడో చేరుకున్న చరిత్ర తనది.

మచ్చ ఉన్నా, మట్టికొట్టుకు పోయినా, మణి మకుటంగా భావించి మస్తకంమీద పెట్టుకుంటానంటున్నావు నన్ను, ప్రభుదాసూ నే నెవర్ని నీకు !

బురదలో కాలు జార్చుకున్న నా లాంటిదాన్ని ఇసుక మీద పోసుకున్న చంటిపిల్లతో సమానంగా ఆదరిస్తు న్నావు సాటివ్యక్తి లోపాన్ని ఇంత తేలికగా కొట్టిపారవెయ్యగల మాన వత్వం నువ్వెక్కడ నేర్చుకున్నావు ?

ఓ కారు మీద ఎక్కి సర్వనాశనం అయ్యాను మరో కారు కిందపడి ఇంకో జన్మ ఎత్తేను ఎలాంటి చిత్రమైన బతుకు నాది.

నాకు జరిగిన అన్యాయం తెలుసు కున్నాక - నేను తిరిగి పునరుద్ధరింప బడడంలో వీళ్లందరికీ ఎందుకింత పట్టు దల ! నా గాధ చెప్పకుండా తప్పించు కుందామనుకున్నాను కుదరలేదు ! ఉత్తరం రాసి పారిపోదామనుకున్నాను, జరగలేదు !

'అంత సుళువుగా చేతికి చిక్కే దాన్ని కాను' అని కబురంపించాను 'మీకు మీరుగా వచ్చి పలకరిస్తేగాని ఇక పలకను' అని కబురు చేరింది ! ఇంతగా మనుషుల్ని తక్కువ అంచనా వేసుకున్న నన్నా, లేక ఆ ఉత్తరాన్నా ఇంతింత ముక్కలు చేయవలసింది !

అలా ఎంతసేపు ఎన్నెన్ని దూరాల వైపు విహరించేవో ఆ ఆలోచనలు. తలుపు విరక్కొడుతున్నట్టు చప్పుడై, ఆ చీటీ తలగడా గలీబులో దాచేసి తలుపు తీసింది యాలిస్

గుమ్మం దగ్గిర దయామయీ, మరియమ్మా !

"అదేమిటమ్మా అలా ఉన్నావ్ ! ఒంట్లో బాగులేదా ?" అంటూ దయా మయి లోపలి గదిలోకి వచ్చి వరండా లైటు స్విచ్చివేసింది

"అయ్యయ్యో, ఏడుస్తున్నావా ?

మొహం నిండా ఆ దారిక లేమిటి ? ఏం ఏమయింది ?"

అప్రయత్నంగా యాలిస్ దయామయి ఒడిలోకి హోరున ఏడుస్తూ ఒరిగిపోయింది ఇన్నాళ్లూ దాచుకున్న ఆమె కఠినత్వం కరిగిపోయింది

ఎప్పుడూ తనంతట తను తన దగ్గిరగా రాని ఆ అమ్మాయి తన కంఠాన్ని కావలించుకుని బావురుమంటూంటే ఆ స్పర్శకి దయామయి తల్లడిల్లిపోయింది ఆమె కళ్లే నిండిపోయాయి కొంత సేపటికి ఎలాగో నిలదొక్కుకుని అంది

"ఏం, బాబుని తీసుకురావడానికి ఏ విధంగానూ కుదరదని యివాళ రాఘవయ్యగారు చెప్పేశాడా ?"

ఆవాళ ఆదివారం తను యింట్లో ఉంటాననీ - అన్ని విషయాలూ మాట్లాడ్డానికి నాలుగ్గంటలకి సరిగా రమ్మనీ చెప్పింది యాలిస్ ఆ మాట ఆ సాయంకాలం ఆరున్నరకి గుర్తు వచ్చింది ఆమెకి !

"అసలు ఆ ప్లీడరు రానే రాన్దే !" అంది యాలిస్

కాని మరియమ్మ ఇచ్చిన భోగట్టా వేరు.

"ఆయన సరిగ్గా నాలుగ్గంటలకే వచ్చారమ్మా ! ఈ కాంపౌండు గేటు దగ్గిర నిలబడి ఎన్నిసార్లు పిలిచినా ఎవరూ తలుపు తియ్యలేదుట వెళ్లిపోయాడుట డేవిడ్‌రాజు చెప్పేడు ఈ సంగతి మరో గంటకి తెలిసి నేను వచ్చి చూశాను లోపల తలుపు గడియ వేసి ఉంది

'వారమంతా పనిచేసి ఉంటుంది, ఒక్క ఆదివారమే కదా తీరిక, పడుకుని ఉందేమో ! లేపడ మెందుకు' అని వెళ్ళిపోయాను తిరిగి దీపాలు పెట్టేక వచ్చి చూశాను అప్పటికీ లోపల లైటు లేకపోతే భయంవేసి పెద్దమ్మగార్ని తీసుకొచ్చాను "

"ఇంతకీ ఏమయిందో చెప్పవేం యాలిస్ ?"

"బజారుకెళ్ళి వచ్చి నీరసంగా ఉందని పడుకున్నాను నిద్రపట్టేసినట్టుంది. బాబుని సవితల్లి నానా బాధలు పెడుతున్నట్టు కలవచ్చింది నా దుఃఖం మరి ఆగలేదు !"

అని సమయస్ఫూర్తిగా అప్పటికేదో చెప్పి తప్పించుకుంది యాలిస్.

"సమయానికి మరియమ్మ వచ్చిందిగాని యీ మారుమూల ఒక్కర్తివీ ఏమైపోదువో ! అయినా మేమందరం ఉండి కూడా నీకు నువ్విలా ఏకాంతవాస శిక్ష విధించుకుంటూ ఉంటే, మేం చూస్తూ ఊరుకోడం చాలా బాధగా ఉంది యాలిస్ ! ఇంతగా గుండె దెబ్బతింది యింక యీ రాత్రి ఏం నిద్రపడుతుంది నీ కిక్కడ ! "మరియమ్మా, ఇంకా చూస్తావేం, గదులన్నీ తాళాలువేసి గుత్తి తీసుకురా పిల్లలకి వాళ్లకి బుద్ధుండక

పోతే పెద్దవాళ్లం మనకైనా ఉండక్కర్లే ?"

యాలిస్ భుజంమీద చెయ్యివేసి తన భవనంవైపు నడిపించబోయింది దయామయి.

"అలాగే వస్తానుండండి. నా తల గడా తెచ్చుకోనియ్యండి. అది లేకపోతే సరిగ్గా నిద్రపట్టదు నాకు" అని లోపలికి వెళ్ళి తలగడా భద్రంగా ప్రేమగా పట్టుకుని ఇవతలి కొచ్చింది యాలిస్.

* * *

ఎప్పటికీ వన్నె తరగని, వాడి ఎరగని రోజ్ కలరు డాలియా పువ్వు ఒకటి ప్రశాంతి మూడవ పంటగా అవతరించడం కాదు గాని, ఆమె వ్యక్తి త్వంలోనే కొట్టవచ్చే మార్పు పసిగట్ట సాగింది యాలిస్.

వాళ్ళున్న ఇల్లుగాని, ఆమె పనిచేసే బ్యాంకిగాని యాలిస్ ఇంటికీ స్కూలికి చాలా దూరంలో ఉండేవి గనక ప్రశాం తితో యాలిస్‌కి పరిచయం పెరిగే అవ కాశమే ఉండేదికాదు. ఇప్పుడు ఆమె ట్రాన్స్ఫరై వచ్చిన యీబ్రాంచి యాలిస్ స్కూలికి బాగా దగ్గిర. నెలనెలా మనీ డిపోజిట్ చేసేటప్పుడేకాక — వరసగా ఏ మూడు పిరీడ్సు ఖాళీఉన్నా యాలిస్ బ్రాంచి ఆఫీసుకి వెళ్లిపోయేది. అదిగాక ఆ బ్రాంచి మేనేజరుకి లేడీ ఎంప్లాయీస్ అంటే ప్రత్యేకమైన గౌరవం. తను పని చేసే సీటుకాక ప్రశాంతికోసం మొగ వాళ్లకి దూరంగా రెండు క్రబీరువాల మధ్య రూంలా ఏర్పరచి రెండు కుర్చీలూ, ఓ బల్లా పడేయించి ఓ కర్టెనూ అదీ ఏర్పాటుచేశాడు ఆయన. యాలిస్ ఎప్పుడు వెళ్ళినా ఆ కర్టెన్ గదిలోకి వెళ్లి కూచుంటుంది. అక్కడ బల్లమీద ఉన్న ఏ పేపరో తిరగేస్తూ ఉంటుంది. ఆమె రాకని గమనించిన ప్రశాంతి ఏమాత్రం తీరిక చిక్కినా ఓ అరగంట వ్యవధిలో అక్కడి కొస్తూ ఉంటుంది. అదిగాక ఆ బ్రాంచి కొత్తగా తెరిచిందవడంచేత ఏ వర్కరుకయినా చేసే వర్కుకన్న కొట్టే హాస్కే ఎక్కువ !

తన గురించి పదే పదే భోగట్టాలు చెయ్యడం, సానుభూతి కురిపించడం ఇలాంటివి యాలిస్‌కి మొట్టమొదట్నుంచీ ఇష్టంలేని పనులు. అలాంటి ఆరాలు తీసేదనే మొదట్లో ఆమె ప్రశాంతిని తప్పించుకుని తిరిగేది. కాని ఇప్పుడు ప్రశాంతికి ఇంకొకరి గురించి అడిగే తీరికే లేదు. ఆఖరికి కృపానంద్, ప్రభుదాసూ, కిరణ్ ఈ పేర్లు కూడా ఆమె మాటల్లో దొర్లేవి కావు. ఎంత సేపూ తనూ తన మొగుడూ, తన ముగ్గురు పిల్లలూ. వీళ్ల గురించి విన డానికి ఆమె కొక శ్రోతకావాలి. రొటీన్ వర్కులోంచి యాలిస్‌కి రిలీఫ్ కావాలి. అందుకనే వాళ్లిద్దరూ ఒకరికొకరు ఆప్తు లయిపోయారు. నెలరోజుల్లోనే మీరు

మీరు అనఖడేవాళ్లు నువ్వు నువ్వు అయిపోయారు

ఏ నెల కానెల తను రిజైన్ చేసేస్తా నన్నట్టు చెబుతూంటుంది ప్రశాంతి

"పేరుకి ఏభై రూపాయిలిచ్చి ఆయాని పెట్టాము గాని దానికేం కావా లమ్మా, కడుపా, వీపా? పిల్లంకోసం ఏ మిచ్చినా దాని కడుపులోకే చేరు తాయి ఆఖరికి! ఏదో బొత్తిగా డాలీకి ఏడాదయినా రాలేదని పెట్టేంగాని, అదీ నేనూ చేసే పనేముందనీ! ఆ మధ్య మా బేబీని పక్కవాళ్ల గిరిబాబు కొడుతూ ఉంటే చూస్తూ ఊరుకుందిట పిచ్చిముండకి ఎంత బొప్పికట్టిందో! ఇది చేసే ఇంత గొప్ప పనికీ యీ ఆయాకి నాగాలు కూడాను! అన్నట్టు నాగాలంటే జ్ఞాపకం వచ్చింది యీ మధ్య యీ మిస్సువస్ శామ్యూల్ నాకు పెట్టిన నిక్ నేమ్ ఏమిటో తెలుసా! ఏమిటో చెబితే నువ్వేం నవ్వుకుంటావో!"

"ఫరవాలేదు, చెప్పు చెప్పు" అని యాలిస్ ఎగదొయ్యకుండానే ఆమె కంటిన్యూ చేసింది

"నా పేరట, మరేమోట, నాగావళిట!"

అని ఉన్నట్టుండి మొహం సిగ్గుతో కందగడ్డ చేసుకుని తలవంచుకుంది. యాలిస్‌నుంచి తను ఎదురు చూసిన రెస్పాన్సు రాకపోడంతో చిన్న బుచ్చుకుని—

"ఏమిటో-నువ్వూ నీ లోకమూ... నీకు మామూలు మాటలే బోధపడి చావవు! నీతో చెప్పటమేమిటిలే నేను - నేను అస్తమానూ - నాగాలు పెట్టేస్తు న్నానట అందుకని ఆ పెంకి ఘటం నాకీ పేరు పెట్టేడు"

"నువ్వు నాగాలు పెట్టడం ఏమిటీ?" అని ఆశ్చర్యంగా అడిగింది యాలిస్

"అయ్యో ఇంకా బోధపళ్ళేదూ నీకు? ఇంకెలా చెప్పాలి నీకు?" అంటూ అటూ ఇటూ చూసి స్వరం తగ్గించి ఆమెతో అంది

"ఈ మొగాళ్ళకేం పనా పాటా! ఎంత వయసొస్తేనేం, ప్రతీ రాత్రీ మనం కావాలి తల్లి కెప్పుడూ పిల్లల రంధి కాని ఆ మొగమహారాజు లివన్నీ గమ నిస్తారా! ఒక్కరోజు మనం నాగా పెడితే మొగవాళ్లు ఒప్పుకోరు అందులో ఈ శామ్యూల్ మహ కచ్చితం మనిషి ఏ పిల్లలతోనో అలసిపోయి ఏ రెండ్రో జులో పక్కకి తిరిగి పడుకున్నామో, ఇదిగో ఇలాంటి పేర్లు పెట్టి ఎక్కడలేని వేళాకోళాలూను!"

యాలిస్ మ్రాన్పడిపోయింది

ముగ్గురు పిల్లల తల్లి బయటపెట్ట వలసిన పోకిరీ కబుర్లేనా యివి!

ఆ మధ్య తను ఉండగానే ఎవరో ప్రశాంతి వయసు ప్రసక్తి తెచ్చారు

"ఓ ముప్ఫై ఏళ్ళయినా ఉండవా ఆవిడకి ?" అనుకున్నారు.

ఆ మాట చెవినపడి తాటి ప్రమాణాన లేచింది ప్రశాంతి.

"ముగ్గురు పిల్లల్ని కన్నంత మాత్రాన అప్పుడే ముప్ఫై ఏళ్ళు వచ్చేసాయా నాకు ? ముప్ఫై అని ఊరుకున్నారేం, అరవై అనకపోయారా ? రికార్డు తీసి చూడరాదూ, నా డేట్ ఆఫ్ బర్త్ ఏదో ? పెళ్ళి ప్రసక్తిలేకుండా ఈ అమ్మాయిలా ఉండిపోతే ఎవరికైనా పెళ్ళికూతుర్లా కనిపిస్తారు కాబోలు ! ఇంతా చేస్తే ఆ అమ్మాయి నా కంటే పెద్దదయ్ ఉంటుంది. ఏమంటావ్ ఏలిస్ ?"

తను మాట్లాడలేదుగాని ఆ మాటకి అందరూ నవ్వుకున్నారు.

"వీళ్ళకి నా మాటంటే నవ్వులాటగా ఉంది. నా డేట్ ఆఫ్ బర్త్ ఉన్న స్కూలు రికార్డు వీళ్ళకి అందనివ్వకండి."

అని బాస్‌తో ఫిర్యాదు చేసింది ప్రశాంతి.

ఆ రాత్రి రాత్రంతా ఆమె కబుర్లన్నీ చెవుల్లో గింగురుమని తిరుగుతూనే ఉన్నాయి యాలిస్‌కి. అన్నిటికన్న ఎక్కువగా "నాగావళి" అనే నాలుగక్షరాలూ పదే పదే ఆమె చెవుల్లో రొద చేయసాగేయి. నాలుగేళ్లు వెనక్కిపోయి ఆ నాటి సముద్ర పొద్దున మదన్‌తో ఆమె తొలి కలయిక నెమరు వేసుకోసాగింది ఆమె మనసు.

చెట్టు కొమ్మమీంచి కిందికి వంగిన ఏసుక్రీస్తు అందమైన మొహాన్ని ముద్దాడదామనే చిన్ననాటి కోరిక - ఎప్పుడు కారు హారన్ వినపడుతుందా, పక్క తోవన పరిగెత్తు కెళ్ళి ఎప్పుడు మదన్ ఒళ్ళో పడదామా అనే ఆ ఉడుకు వయసు పడే తపనా - కిరణ్ భార్యా తమ ఇంటికి వచ్చి తనూ ఇలా లోపలికి వెళ్ళగానే చూడలేదనుకుని ఒకరి మీద ఒకరు ఒరిగిపోవడం ... ముగ్గురు బిడ్డల తండ్రి అయిన శామ్యూల్ 'ఆ విషయంలో' మాత్రం అతి కచ్చితంగా ఉండడం...

ఇదేనా, జీవితం ఇంతేనా ?

యాలిస్ ఎందుకోగాని నిలదొక్కుకో లేకపోయింది. లేచి లైటు వేసింది. ఏదో పుస్తకం చదువుకుందామని ప్రయత్నించింది గాని దానిమీద మనసు నిలుపుకో లేకపోయింది.

లేచి నిలువుటద్దం ముందు నిలుచుంది. ఎగురుతున్న గుండెలు చెబుతున్న గుహ్య సందేశం ఏమిటి ? కళ్ళల్లోని ఎరుపు ఎరుకపరుస్తున్నదేమిటి ?

అద్దం ముందు నిలవలేకపోయింది. లైటార్పేసింది. మంచంమీద వెలికిలా పడుకుంది. ఇలాంటి ఒంటరితనపు అల్లరి ఇదివరకు తను పడంది కాదు. కాని

ఇవాళ చెవులు మూసుకున్నా అదె మాట.

"ఒక్కరోజు మనం నాగా పెడితే మగవాళ్ళు ఒప్పుకోరు !"

ఈసారి కళ్ళు మూసుకుంటే మరో రకం దృశ్యం.

అందులో ఆడది తనే.

తన దగ్గిరగా కూచుని తనని దగ్గిరగా తీసుకుంటున్నది ఎవరు ? ఎవరూ ?

ఆమె రక్తమంతా గుండెంలోకి ఎగ్రబాకినట్టయింది.

అవును- ఆ రోజు - ఆ సాయంకాలం - పార్కులో తన్ను దగ్గిరగా తీసుకోబోయింది ప్రభూ కాక మరెవరు !

యాలిస్ తలగడాను దగ్గిరగా తీసుకుని కౌగలించుకుంది.

తలగడా పొరంలో గరగరలాడే తాగితం.

వయసు వేడిలో గిరగిరా తిప్పివేసే తాగితం.

నిజంగా శామ్యూల్ కేనా అది కావలసింది ?

కాదు ... కాదు ... ముగ్గురు బిడ్డల తల్లి అయినా అది కావలసింది ప్రశాంతికే. ఆడది మరోలా ఎలా చెబుతుంది !

ఇరవై రెండైనా వెళ్ళని తనకేనా ఎప్పుడూ ఏమీ అక్కర్లేనిది !

ఏమిటింత సిగ్గుచేటుగా ఆలోచిస్తున్నది తను !

లతటువని పట్టి అని బైబలు అనంది. బైబిల్ మధ్య పెట్టిన సేవింగ్సు బ్యాంకు ప్యాసు బుక్కు ఇవతల పడింది.

తీసి చూసింది. నాలుగువేల రెండు వందలు !

బాబు జ్ఞాపకం వచ్చాడు. వాణ్ణి తలుచుకోగానే తక్కిన తన తలపులన్నిటికీ సిగ్గుపడిపోయింది యాలిస్.

"మీ అమ్మ సిగ్గుమాలిన ఆలోచనలు చూసి నవ్వుతున్నావా బాబూ ! నూట ఎనభై తెచ్చుకుంటున్నా ఎనభై ఉంచుకుని నూరు రూపాయిలు ప్రతి నెలా నీ కోసం జమకట్టేస్తున్నాను. పొద్దుట పూట కొత్తగా ట్యూషను కుదుర్చుకున్నాను. సాయంకాలం డ్రైవు నేర్చుకుంటున్నాను. కాలంలోని ప్రతి క్షణమూ కూడబెడుతున్నాను. ఒక్కొక్క స్వేదబిందువూ ఒక్కొక్క పైస కింద మార్చి నిలవజేస్తున్నాను. ఇన్నాళ్ళ మీ అమ్మ పట్టుదల ఏమైందని వేళాకోళం చేస్తున్నావా నా చిట్టి తండ్రీ !"

"లేదురా, లేదు ! ఇంకెప్పుడూ ఇలా చెయ్యను. ఆ రోజు అదివారం నాడు నిన్ను తెచ్చుకునే లా పాయింటు కోసం ప్లీడరు వస్తే ఇలాంటిదే ఇంకో మైకంలో పడి ఆ మాటే మరచిపోయాను ... మళ్ళీ ఇవాళ ఇలాంటి దుర్మార్గపు ఆలోచనలకు చోటిచ్చాను.

నీ మీద ఒట్టు. ఇంకెప్పుడూ యిలాంటి తప్పుడు తలపులు రానియ్యనుగా!

"ఇంకెన్నాళ్లు, మరో పది నెలలు! అయిదువేలూ అవగానే మరో అయిదు నిముషాలు ఆగుతానా నేను! నీ కోసం పోరాడి నిన్ను గెలుచుకుని తీరుతాను. నువ్వే నా ప్రపంచం. నా ప్రాణం. నిన్ను దగ్గిరెట్టుకుని నిన్ను చూసుకుని మురిసిపోతూంటే ఇంకెవరు కావాలిరా, ఇంకేం ఆలోచనలు వస్తాయిరా యీ అమ్మకి!

ప్యాన్ బుక్ మళ్ళీ బైబిల్‌లో పెడుతూంటే అందులో ఎఱ్ఱ సిరాతో అండర్ లైన్ చేసిన వాక్యం ఒకటి ఆమెని ఆకర్షించింది.

"పాపులారా! ధన సంపాదన కోసం ఎందుకు ఆత్మను అమ్ముకొంటారు? ధనవంతుడు పరలోక రాజ్యంలో ప్రవేశించడంకంటే, సూది బెజ్జంలో ఒంటె దూరడం సులభం కాదా!"

ఒక్క నిముషం దెబ్బతిన్నట్టు అయింది. అయినా వెంటనే తేరుకుంది.

దయామయి కారులోనే చర్చికి వెడుతుంది. మైక్రోఫోను ముందే మత బోధ చేస్తుంది. వేలకొద్దీ మత విషయమైన కరపత్రాలు ప్రింటింగు మిషన్ లోనే అచ్చు అవుతున్నాయి. వెడల్పాటి కారూ, విశాలమైన చర్చీ, నిలువెత్తు చలవరాతి విగ్రహాలూ, నలుగురికి వినపడే ప్రసారయంత్రాలూ, ప్రింటింగు మిషన్లూ — ఇవన్నీ బీదవారికి అందుబాటులో ఉండేవి కానేకావు. అతి ఖరీదైన ఇలాంటి సాధనాలు ఉపయోగించే "ధనవంతుడు పరలోకరాజ్యం చేరడం అతి దుర్లభం" అని ప్రచారం చెయ్యడం వింతగా లేదా?

లేదు ... లేదు ... ఓడిపోయి, చీకటిలోపడి, తను నమ్మినదానినే తను కువ్యాఖ్య చేసుకుంటున్నది. "పాపమూ, పశ్చాత్తాపమూ" అనే ప్రకరణంతీసి గడగడ చదువుకుంది.

ఒకవేళ తనడి తప్పుడు మార్గమైనా తనని యీ విధంగా తయారుచేసింది మదనగోపాలస్వామే. ముల్లుని ముల్లుతో తియ్యక తప్పదు. పువ్వులా బతుకుతున్న తనని ముల్లుగా మార్చింది అతనే.

యాలిన్ దంతపు భరిణ తీసింది. మదన్ పంపిన ఉత్తరం మరోమారు చదువుకుంది.

మదన్! నా కొడుకుని నాకు అప్పచెప్పేవా, సరేసరి...లేదా నీ జీవితంలో ఇక సుఖమన్నది సరి!

పగతో కూడిన తృప్తితో ఆమెకి కొంతసేపటికి కాస్త మగత నిద్రపట్టింది.

(సశేషం)

# నిజం నిష్ఠురం



బూర్లె నాగేశ్వరరావు

వజ్రగిరి నగరానికి ఎక్కడినుంచో ఒక బ్రాహ్మణుడు ఉగాది రాబోతూండగా దిగాడు. అతను పెద్ద చదువుకున్న వాడిలాగా లేకపోగా కొంచెం పిచ్చి వాడిలాగా కూడా కనిపించాడు. కాని అతను నలుగురి జాతకాలు చూసి, జరిగినదీ, జరుగుతున్నదీ ఏ మాత్రమూ పొరపాటు లేకుండా చెప్పాడు.

ఇంతలో ఉగాది వచ్చింది. ఆ రోజు సాయంకాలం ఊళ్ళోవాళ్ళు ఊరి దేవాలయంలో పంచాంగ శ్రవణం ఏర్పాటు చేసి, ఆ పనిని బ్రాహ్మడిమీద పెట్టారు.

ఆయన సంవత్సర ఫలితాలు చెబుతూ చిట్టచివరకు, "ఈ సంవత్సరం మొదలుకుని వరసగా మూడు సంవత్సరాలపాటు దేశంలో తీవ్రమైన కాటకం ఏర్పడబోతున్నది. అందుచేత గ్రామస్థులు ధాన్యం నిలువచేసుకుని పొదుపుగా వాడుకోవటం మంచిది," అని హెచ్చరించాడు.

పురాణ శ్రవణానికి వచ్చినవారిలో చాలామంది ఈ హెచ్చరికను లెక్క చెయ్యలేదు. ఆ దేశం సుభిక్షమైన దేశం. ఎన్నో తరాలుగా అక్కడి

ప్రజలు కాటకమన్నది ఎరగరు. కొద్దిమంది ఆ బ్రాహ్మడితో, "మాకు ఏ భయం వచ్చినా కరువు భయం మాత్రం లేదు. చుట్టుపక్కల దేశాలన్నీ క్షామం వాతపడినా మాకు తిండిలోటు ఉండదు. మా గాదెలు ఎప్పుడూ నిండుగా ఉంటాయి," అన్నారు.

బ్రాహ్మడు చేసిన హెచ్చరికను కొద్ది మంది వర్తకులు పట్టించుకున్నారు, కాని వాళ్లు పైకి ఏమీ అనలేదు.

గ్రామస్థులు తన హెచ్చరిక పట్టించు కోకపోయేసరికి, బ్రాహ్మడు తిన్నగా రాజుగారి వద్దకు వెళ్లి మూడేళ్లపాటు దేశం తీవ్రమైన తిండి కరువుకు గురి కాబోతున్నదనీ, కావాలంటే రాజుగారు నక్షత్ర జపాలూ, గ్రహశాంతులూ చేయిస్తే చేయించవచ్చుననీ చెప్పాడు.

పిచ్చివాడిలాగా కనిపించే బ్రాహ్మడి మాటల్లో రాజుకు గురి కుదరలేదు. ఆయన బ్రాహ్మడితో," "తరవాత చూస్తాం. అయినా దేశంలో నాలుగేళ్లకు సరిపడే ధాన్యం నిలువ ఉన్నది. మూడేళ్లు పండకపోయిన అంత బాధ ఉండదనుకుంటాను," అన్నాడు

"మహారాజా, నిలువ ఉన్న ధాన్యం మాయం కావటం కూడా కరువులో ఒక భాగమే. మీ దేశ ప్రజలకు తిండిదగ్గిరా పొదుపు తెలిసినట్టులేదు. వాళ్లను కొంచెం హెచ్చరికగా కూడా ఉండమనండి,'' అని చెప్పి బ్రాహ్మడు వెళ్లి పోయాడు.

అది మొదలు ఆ బ్రాహ్మణ్ణి చూసిన వాళ్లందరూ ఆయనే క్షామదేవత అన్నట్టు, భయం భయంగా చూడ సాగారు. నిజం నిష్ఠురం అన్నమాట అబద్ధం కాదుగదా!

బ్రాహ్మడు చెప్పినట్టే ఆ యేడు వర్షాలులేవు. ఒక్క రైతు కూడా తన పొలానికి నాగలి కట్టలేదు ధాన్యం వ్యాపారులు మంచి ధర పలికారు. నిలువ చేసుకున్నవాళ్లు తమ అవసరానికి ఉంచు కోగా మిగిలిన ధాన్యం హెచ్చు ధరకు అమ్మేశారు. కరువు రోజుల్లో రొక్కం అవసరమవుతుందని వారికి తెలుసు.

మొత్తంమీద ఆ యేడు దేశంలో ఎవరూ తిండికి ఇరకాటాన పడలేదు.

కాని మరుసటి సంవత్సరం కూడా వర్షాలులేవు. భూమి నెర్రెలు విచ్చి ఎడారిలా అయిపోయింది. కరువు రాక్షసి నోరు తెరిచింది. జనానికి తీవ్ర మైన తిండి కొరత ఆరంభమయింది జనం దగ్గిర ఉన్న డబ్బు ఆహార ధాన్యం కొనుగోలుకు ఏ మూలా చాల లేదు. ధాన్యం ధర పాపం పెరిగినట్టు పెరిగిపోయింది. అమ్మితే అట్టెడూ, కొంటే గిద్దెడూ అన్న సామెత అక్ష రాలా నిజమయింది.

రాజుకు ఏంచెయ్యటానికీ పాలు పోలేదు. ఆయన ధాన్యపు వర్తకులను

పిలిచి, వారివద్ద ఉంటే అదనపు ధాన్యాన్ని విడుదల చెయ్యమని కోరాడు తమవద్ద ఉండే ధాన్యం తమ కుటుంబాలకే చాలటంలేదని వాళ్లురాజుకువిన్నవించారు. వెంటనే వాళ్లు తమ ధాన్యపు బస్తాలను ఈశ్వరుడైనా కనిపెట్టలేనంత భద్రంగా దాచేసుకున్నారు.

బ్రాహ్మడు మాత్రం ధ్వజమెత్తాడు. ఆయన నగరంలో ఉండే ధాన్య వర్తకు లందరి దగ్గిరికీ వెళ్లి, "మీ దగ్గిర ఎంతెంత ధాన్యం నిలువ ఉన్నదీ నాకు తెలుసు. మీ రహస్యం నేను ప్రజలకు చెప్పానంటే వాళ్లు మిమ్మల్ని వదలరు. అందుచేత, మీరు ఉంచిన ధాన్యాన్ని బయటపెట్టండి. మీవద్ద ఉన్న ధాన్యం ప్రజలకు రెండేళ్లపాటు సరిపోతుంది," అన్నాడు.

ఈ విధంగా బ్రాహ్మడు బెదిరించిన వారితో నారాయణశెట్టి అనేవాడు ఒకడు. అతను మిగిలిన ధాన్య వర్తకు లతో కలిసి ఒకరాత్రి కుట్రచేశాడు. మర్నాడు వర్తకులందరూకలిసి రాజుగారి దర్బారుకు వెళ్లారు. రాజు వాళ్లను చూసి, కరువు సమస్యకు పరిష్కారం చెప్ప టానికి వస్తున్నారనుకుని చాలా సంతో షించాడు. కాని నారాయణశెట్టి కంట నీరు పెట్టుకొంటూ అన్నమాటలు విన గానే ఆయనకు గుండె జారిపోయింది

"మహారాజా! మేమంతా మరో దేశం వెళ్లిపోతున్నాం నావలు కూడా సిద్ధంచేసుకున్నాం తమవద్ద సెలవు పుచ్చుకోవటానికి ఇలా వచ్చాం," అన్నాడు నారాయణశెట్టి.

రాజు వాళ్లకు ధైర్యం చెబుతూ, "ఈ పని మీరెందుకు చేస్తున్నారు? ఈ కరువు శాశ్వతమా? అయినా, మీరు తిండిలేక చచ్చిపోతున్నారని నేను అను కోను. ఈ సంవత్సరం ఎలాగో తంటాలుపడితే, వచ్చే ఏడు వర్షాలు కురవటం ఖాయం. తిరిగి మీ వ్యాపా రాలు ఎప్పటిలాగే సాగుతాయి," అన్నాడు.

"అలా జరగదు, మహారాజా. ఆ బ్రాహ్మడు మాతో రూఢిగా చెబు తున్నాడు అతను వచ్చే సంవత్సరం కూడా కరువు ఉండేటట్టు చూస్తాడుట! అతను తల్చుకుంటే అంతపనీ చేసే లాగే ఉన్నాడు," అన్నాడు నారాయణ శెట్టి.

"ఎవరా సృష్టికర్త?" అని రాజు ఆశ్చర్యంగా అడిగాడు.

"కిందటేడు మన దేశానికి శని గ్రహంలా వచ్చిన బ్రాహ్మడే. వాడు చూడటానికి పిచ్చివాడులాగే ఉన్నాడు గాని, సామాన్యుడు కాడు. కాకపోతే ఈ కరువు గురించి ముందే ఎలా చెప్పాడు?" అన్నాడు నారాయణశెట్టి.

"మీరు పొరపాటు పడుతున్నారు ఇంత దేశానికి కరువు వచ్చేశక్తి ఒక పిచ్చి బ్రాహ్మడి కుంటుందని మీరెలా

అనుకున్నారు, మీరెవరూ దేశం విడిచి వెళ్లటానికి వీల్లేదు," అన్నాడు రాజు.

వర్తకులు వచ్చినదారే వెళ్లిపోయారు. రాజుదగ్గిర వాళ్ల ఎత్తు పారలేదు. కాని బ్రాహ్మడు వాళ్లకు ప్రాణసంకటమై కూర్చున్నాడు. అతడు తమ నిలువలను ప్రజలకు చెప్పి, తమ ప్రాణాలకు ఎసరు తీసుకురాగలడు. అతడి పీడ ముందు వదిలించుకోవాలి. అందుకు వాళ్లు మరొక ఉపాయం ఆలోచించారు.

ఆకలి బాధ ఎక్కువైనకొద్దీ జనంలో వెర్రి ఆవేశం పెరిగిపోయింది. నారాయణశెట్టి కొందరితో, రాజుతో చెప్పినట్టే, ఈ కాటకం తెప్పించినవాడు దేవాలయంలో ఉండే బ్రాహ్మడని చెప్పారు. వాళ్లు వెర్రెత్తిపోయి, ఆ బ్రాహ్మణ్ణి పట్టుకుని చితకతన్ని, నారాయణశెట్టి ఇంటిముందరికి తెచ్చారు.

వాళ్లు ఆ బ్రాహ్మణ్ణి, "ఓరీ శని బ్రాహ్మడా ? మాకు కరువు ఎందుకు తెప్పించావు ? మమ్మల్నందర్నీ తిండి లేకుండా ఎందుకు చంపుతున్నావు ? నీ శనిని నువు తీసుకుపోతావా, పోవా ?" అని అడిగారు.

బ్రాహ్మడు వాళ్లతో "అయ్యా, మీరన్నది నిజమే. ఈ కరువు నా మూలంగానే వచ్చింది. దీన్ని త్వరలో నేనే పోగొట్టుతాను. నాకు కాస్త వ్యవధి ఇయ్యండి," అన్నాడు.

"ఆ పని చేసేదాకా నిన్ను కదలనియ్యం," అని ఆ జనం బ్రాహ్మణ్ణి నారాయణశెట్టి ఇంటి పక్కన ఉన్న ఒక పాడుపడిన ఇంట్లో పెట్టి, తాళం వేశారు.

బ్రాహ్మడు తన పరిస్థితి గురించి తలుచుకుంటూ, కిటికి నేల మీద పడుకున్నాడు. కొద్దిసేపట్లో ఏదో ధ్వని వినిపించింది. అది ఒక మూలనుంచి వస్తున్నది. అక్కడ ఒక కలు గున్నది. దానిలోనుంచి రెండు ఎలుకలు పైకి వచ్చి మరొక కలుగులోకి పోవటం బ్రాహ్మడికి కనిపించింది. ఆ ఎలుక నోట ధాన్యం ఉన్నది.

ఎలుకలు కలుగులోనుంచి ఎలా ధాన్యం తెస్తున్నాయి ? అవి జొరబడిన రెండో కలుగే వాటి నివాసం అయి ఉండాలి. మొదటి కలుగు ధాన్యంగల చోటికి దారిఅయి ఉండాలి. నారాయణశెట్టి ఇల్లు పక్కనే ఉన్నది. ఎలుకలు అతని ఇంటినుంచి ధాన్యం తెస్తున్నాయా ?

ఈ ఆలోచన రాగానే బ్రాహ్మడికి ఏనుగంత బలంవచ్చింది. అతను చూరు నుంచి గట్టివాసం ఒకటి విరిచి, దానితో కలుగును గబగబా తవ్వసాగాడు.

నారాయణశెట్టి ధాన్యం దాచిన చోటు ఎంతో దూరంలేదు. రెండుగంటలు



శ్రమపడి బ్రాహ్మడు అక్కడికి తాను దూరేకంత చేశాడు. తరవాత ఆయన తెల్లవార్లూ శ్రమపడి ఆ గోదామునుంచి ధాన్యంతెచ్చి, పాడుబడిన ఇంట్లో పెద్ద రాశిపోశాడు.

ఉదయం కాగానే కొందరు మనుషులు వచ్చి, "ఏం బ్రాహ్మడా, శని ఎంతదూరం వెళ్ళింది?" అని అడిగారు.

"తిండిలేని వాళ్ళను పిలవండి ప్రస్తుతానికి ఒకపూట గింజలిస్తాను", అన్నాడు బ్రాహ్మడు.

వాళ్ళు వెళ్ళి తమ వాళ్ళందరికీ చెప్పారు. తరవాత ఇతరులకు తెలిసింది. ఆ రాత్రి కూడా శ్రమపడి బ్రాహ్మడు నారాయణశెట్టి గోదాం ఊడ్చేసి, తానున్న ఇంట రాశిపోసి, జనానికి తిండి గింజలు పంచసాగాడు.

ఆకలి రోదనలు నిలిచిపోయాయి.

"నా కేమిటి ఇబ్బంది? నా కోసం బోలెడు డబ్బు..." అన్న ఆమె గొంతు దుఃఖంతో రుద్ధమై మూగపోయింది.

"అలా బాధపడటం న్యాయమా పద్మావతీ! అన్నయ్యకోసం చెల్లెలు ప్రాణాలు అడ్డంపెట్టింది. అయితే అన్నయ్య డబ్బుపై చెల్లెలుకి హక్కు లేదా?" అన్నాడు.

ఆమె కనులు తుడుచుకొని సంతోషంగా నవ్వి, "ఏ అన్నా చెల్లెలుకి ఇంత డబ్బు ఖర్చుచెయ్యడేమో! నా కోసం మీరు ఖర్చుచేసినది వేల సంఖ్యకు పెరిగిపోయింది."

"మీకన్నా నాకి డబ్బు ఎక్కువ కాదు. నన్ను వెళ్ళిపోమ్మన్నారా? ఇవేనా ఇవ్వాళ మాటలు?"

"లేదు, కూర్చోండి." నవ్వింది పద్మావతి.

సాయంత్రం ఆరు గంటలు దాటినా లేచి వెళ్ళని పాణిని టైమయిపోయింది మరి వెళ్ళిపోండి. అనేది. ఏదీ మీ చెయ్యి అనే వాడతను. ఆమె మౌనంగా అతని చేతిని తన చేతితో తాకేది. అతనా చేతిని పట్టి నొక్కి వదిలేసేవాడు.

పద్మావతిని హాస్పిటల్ నుంచి డిస్ చార్జి చేసిన తర్వాత. అన్నపూర్ణమ్మ తమ ఇంటికి తీసుకువెళ్తానంటె రంగారావు సుశీలమ్మ వప్పలేదు. మేము ఈ ఊర్లో ఉండేది కొద్దిరోజులు. ఎలాగా కాపురం, ఎత్తెయ్యాలనుకుంటున్నాం. కనుక మా ఇంట్లోనే పద్మావతి ఉంటుందని. బలవంతాన తమ ఇంటికి తీసుకు పోయారు. ఇంకా కొద్దికాలం ఆమెకు రెస్టు అవసరం అని డాక్టరు అనడం వలన పద్మావతి పాణి ఇంటికి వెళ్ళటం లేదు. అతనే ప్రతిరోజూ రంగారావు గారింటికి వస్తున్నాడు. చాలా మంది వారిద్దరికీ ఏదో సంబంధముందనే ధృవ పరచుకున్నారు. ఎవరేమనుకున్నా లక్ష్యపెట్టడంలేదు పాణి.

అతను తన వైపు ఆకర్షితుడయ్యాడని గ్రహించిన పద్మావతి కలవరపడ సాగింది. ఆమె మన స్సాందోళన చెందసాగింది. అతను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. పెళ్ళిచేసుకుంటాను, అని అడగకముందే, తన మనస్సతని ముందు పరచాలి. తన గత జీవిత చరిత్ర వివరాలు అతనికి పూర్తిగా తెలియజెయ్యాలి అని సమయంకోసం ఆత్రతగా ఎదురుచూస్తూంది పద్మావతి.

ఒకరోజు అడిగింది "పాణిగారూ! నా గురించి మీరెంత డబ్బు ఖర్చుచేశారో లెక్క వేస్తున్నారా?" అని.

"ఎందుకని?" నవ్వేశాడతను.

తిరిగి జీవితకాలంలో ఎప్పుడన్నా మీకు చెల్లించాలని.

"అవసరంలేదు లెండి." అతని ముఖ మెందుకో గంభీరంగా ఉదాసీనంగా మారి పోయింది. ఏమో చెప్పబోతూన్నట్లు

అతని పెదవులు కదిలి మళ్ళీ ముడుచుకున్నాయి.

అతని ముఖకవళికలు అర్థంకాని ఆమె కలవరంగా, "పాణిగారూ! నన్ను ఒక చెల్లెలుగా మాత్రమే కదూ మీరు ప్రేమిస్తున్నది?" అడిగింది.

"ఎందుకలా ప్రశ్నిస్తున్నారు? మాటల్లో, చేతల్లో, నేనేమన్నా మీపట్ల పొరపాటుగా ప్రవర్తిస్తున్నానా? అస్సలు రోజూ ఇలా మిమ్మల్ని చూడాలని రావడం తప్పంటారా? నిజమే కావచ్చు. కాని రోజూ ఒక్కసారన్నా మీ మాట వినకుండా ఉండలేకపోతున్నాను. మీ గొంతులోని శబ్దాన్నిబట్టి ఊహిస్తే మీరేదో బాధపడుతూన్నట్టునిపిస్తూంది. క్షమించండి క్రమంగా మీతో మాట్లాడాలనే ఆరాటాన్ని తగ్గించుకుంటాను. నమస్కారం "మరి వెళ్తాను." అని చివాలున లేచి నిల్చున్న పాణి చెయ్యి పట్టుకుని, "నన్ను అపార్థం చేసుకోకండి. నా వివరాలన్నీ మీకు చెప్పాలనుకుంటున్నాను.'' అని ఇంకేమో చెప్పబోయే పదావ్మతి మాట వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు పాణి.

పాణి రావడం చాలా తగ్గించేసేడు. పద్మావతి లేచి నెమ్మదిగా తిరగసాగింది. పాణి వచ్చినా కుశల ప్రశ్నలు వేసి పదినిమిషాలు కూర్చుని వెళ్ళిపోతున్నాడు, ఒక్కోసారి ఫోన్‌చేసి యోగక్షేమాలు కనుక్కుని రావడం మానేస్తున్నాడు.

అతనితో ఏవో మాట్లాడాలనీ, చెప్పాలనీ అనుకుంటూన్న పద్మావతికి ఆ అవకాశం ఇవ్వడంలేదు పాణి.

వరసగా వారంరోజులై రావడంలేదు పాణి. కనీసం ఫోనన్నా చెయ్యలేదు. మనస్సు కొంచం బాధపడింది పద్మావతికి. తానే ఫోన్ చేసింది. అవతల నుంచి అతను పలకగానే "మీరు రావడం లేదు నా మీద కోపం వచ్చిందా?" అడిగింది పద్మావతి.

అతను సన్నగా నవ్విన శబ్దం. తర్వాత "రేపు సాయంత్రం తప్పక వస్తాను. మీ ఆరోగ్యం బాగుందా?" అడిగాడు.

"మీరు రాకపోతే నేనే వస్తానక్కడికి" అందామె.

"వద్దు. మీరు ఇంకా తిరగటానికి వీల్లేదు. అత్తయ్య ఆరోగ్యం అంతగా బాగుండటంలే దీ మధ్య. అందునుంచి రాలేకపోతున్నాను. రేపు తప్పక వస్తానుగా అన్నాడతను

* * *

రాత్రి పదకొండు గంటల ప్రాంతాన బాత్‌రూమ్‌నుంచి వస్తూన్న పద్మావతి, రంగారావూ, సుశీలమ్మా మధ్య సంభాషణ, అందులో తన పేరూ పాణి పేరు వినరావడంతో ఆగి గది తలుపు దగ్గర శబ్దం కాకుండా పొంచి నిల్చుని చెవిఒగ్గి వినసాగింది.

రంగారావు కొన్ని కొన్ని విషయాలే

చెబుతాడు సుశీలమ్మకు. తన అంతరంగికరహస్యాలు ఆమెకు ఎప్పుడూ చెప్పడు. కారణమేమిటంటే ఆమె అన్యాయాన్ని, మోసాన్ని ఖండిస్తుంది. సహించదు, అందుకని.

"పాణి ఇంతకీ ఆ డబ్బు ఇస్తానన్నాడా అడిగారా ?" 'సుశీలమ్మ'

"కావాలి అవసరం ఉంది ఐదు వేలియ్యి అంటే వాడు ఇస్తాడా ? నీ పిచ్చిగాని వందా ఏభై అంటే తీసుకో మంటాడు. అందుకని ఓ ప్లాను వేశాను." 'రంగారావు'

"ఏమిటది ?" 'సుశీలమ్మ'

"రేపు చెక్కు సంతకం ఒకటుంది చేయించేస్తాను."

"అన్నపూర్ణమ్మ చూడదూ !"

ఆమె ఆరోగ్యం అంతగా బాగుండ లేదు.

"అందుకే కాబోలు పాణి వారం రోజులై రావడంలేదు. అయినా మీరు చెక్కు ఎంతకి రాశారో చూడకుండా ఉంటుందా" అన్నపూర్ణమ్మ.

మంచంమీదినుంచి అసలు కదలటం లేదు. పాణి ఇంట్లో పనులు చెయ్యటానికి ఓ మనిషిని ఏర్పాటు చేసుకున్నాడు. పద్మావతి ఎలానూ రాదు. అంత అన్నపూర్ణమ్మకు తీసుకు వెళ్ళి చూపించదులే.

బ్యాంక్ బ్యాలన్సు ఎంతుందో అతనికి తెలియదూ !

"వెర్రి మొహమా ! ఆ బ్యాంకి బ్యాలన్సు ఎంతుందో ఈ మధ్య నేనేగా చెబుతున్నాను ? పద్మావతికోసం డబ్బంటే మాట్లాడకుండా సంతకం చేసి ఇచ్చేస్తున్నాడు. దానిలో ఇది కొట్టుకుపోతుంది "

రెండు క్షణాలు నిశ్శబ్దం. తర్వాత, మళ్ళీ సుశీలమ్మ అంది, పాణి పద్మావతికి మనసిచ్చినట్టున్నాడండీ ! అని.

ఎందుకివ్వడూ ? అయినా దీన్ని తీసుకురావడం నా పొరపాటేమో ! అప్పుడు ఆ అత్తవారు. ఈ వ్యవహారాలన్నీ కైవశం చేసుకుంటే మనకేం లాభం ఉంటుంది ! అనే ఆలోచనతో ఉన్నప్పుడు ఈ పద్మావతి దైవికంగా తటస్థపడింది. అడ్డువేశాను, ఆ పెళ్ళి కాకుండా. కాని ఇదే ఒక సమస్య అయిపోయింది నాకు.

"అయ్యో ! చాలా మంచి పిల్లండీ !"

"అబ్బో. ఇదా ! అమాయకురాలనుకున్నావేమిటి ? అతని వ్యవహారాలన్నీ నడిపిస్తూందిదే ! రాబడి ఖర్చుల్లో ఒక కాణీ వారరానివ్వదు. అన్నపూర్ణమ్మ దీని దగ్గర ఎందుకూ పనికిరాదు."

"పాణి ఒకవేళ ఈ పద్మావతిని స్వీకరిస్తే ! ఇద్దరూ భార్యాభర్తలయిపోతే !"

"ఏదో ఏడవనిద్దూ ! మన వాటా గట్టెక్కించాక మనం మకాం ఎత్తేస్తున్నాం గదా !"

డబ్బు కట్టేస్తే మనవాడు బయట పడతాడంటారా ?

"ఆ ఇది ఆ దెబ్బతో వస్తుందను కున్నాను సుమా! వాడు చావాల్సింది. ఇదక్కడెందుకు తగలడిందో తెలి యదు. ప్చ్ ప్లాను పాడయిపోయింది.

"పోన్లెండి ఒకరికి కీడు తలపెట్ట కూడదు. పిల్లలుగల వాళ్ళం అంది సుశీలమ్మ."

ఆపై మరి సంభాషణ వినరాలేదు. మెమ్మదిగా తన గదిలోకి వెళ్ళిపోయింది పద్మావతి. మంచంమీద వాలిందే కాని నిద్రపట్టలేదు. ఈ మధ్య సుశీలమ్మ తన కొడుకేదో కేసులో ఇరుక్కు న్నాడని కంగారుపడటం వింది. అతను స్టేట్ బ్యాంకిలో కేషియరుగా పని చేస్తున్నాడు. ఏదో డబ్బు వాడేసి ఉంటాడు ఛీ. ఛీ. గోముఖవ్యాఘ్రాలు వీరు. చూస్తాను, ఎన్ని వేల చెక్కు రాసి సంతకం చేయిస్తారో! రేపు పాణి గారింట్లోనే మకాం వేస్తాను. ఇహ లాభంలేదు. దాచేస్తాడు. దొంగని పట్టి అప్పగించాలి, అనుకుంటూ బరువుగా కళ్ళు మూసుకుంది పద్మావతి.

* * *

రంగారావు వీధిలో కెళ్ళిపోయిన తర్వాత గబగబ చీర మార్చి తల దువ్వుకొని ప్రయాణమయ్యింది పద్మావతి.

"ఎక్కడికే అమ్మాయ్ ప్రయాణ మవుతున్నావ్?" ప్రశ్నించింది సుశీలమ్మ.

ఇప్పుడు సుశీలమ్మ ముఖం చూస్తే అసహ్యం వేస్తూంది పద్మావతికి తమ స్వార్థంకోసం ఎదుటి మనుముల్ని ఎంత తేలిగ్గా వంచించాలని చూస్తారు? దుర్మా ర్గులు, అనుకొని క్షణం ఆలోచించి, హాస్పిటలు కెళ్ళివస్తాను, అంది. టక్కున.

"ఎందుకు? ఫోన్ చేస్తే డాక్టరే ఇంటికి వస్తారుగా!" అంది సుశీలమ్మ. అస్సలివాళ పద్మావతి ఇల్లు కదలడం ఆమెకు సుతరామూ ఇష్టంలేదు.

"రిక్షాలో వెళ్ళివచ్చేస్తాను. ఇవ్వాళ ఏమిటో కొద్దిగా వెన్నులో నొప్పిగా ఉంది. అంటూ సుశీలమ్మ వెళ్ళవద్దని ఏమేమో చెబుతూన్నా వినిపించుకో కుండా వీధిలోకి వెళ్ళిపోయిందిపద్మావతి.

రోడ్డుమీద దొరికిన రిక్షా ఎక్కి చక్రపాణి గారింటికి పోనియ్ అంది.

ఆమె వెళ్ళేసరికే రంగారావు పాణి దగ్గర కూర్చుని ఏదో మాట్లాడు తున్నాడు. చెక్కు సంతకం అయిపోయి ఉంటుంది ఎలా అయినా ఇతని నిజ స్వరూపం ఇవ్వాళ బయటపెట్టేస్తాను. అనుకుంటూ పాణి గదిలో అడుగు పెడుతూ 'నమస్తే. పాణిగారూ,' అంది పద్మావతి

పద్మావతి అలా వస్తుందని ఊహించ లేదు రంగారావు. తాను చెయ్యబోయే

ప్రతి పనికీ అడ్డం తగులుతుందీ పద్మావతి. రంగారావుకి పద్మావతిని పీక నులిమి చంపెయ్యాలన్నంత కోపం వస్తోంది. అయినా తాను వచ్చిన పని నెరవేర్చుకు పోవాలనే సంకల్పంతో పాణీ! నాకు అవతల చాలా పనులున్నాయి వెళ్ళాలి సంతకం చెయ్యి" అంటూ కాయితం టేబిలుమీద పెట్టి పాణిచేతికి పెన్నిచ్చి ఆ చెయ్యి పట్టుకున్నాడు, సంతకం చేసే స్థలం అతనికి తెలియజెయ్యడానికి.

పద్మావతి వచ్చిందనే సంతోషంలో రంగారావుని తొందరగా పంపించెయ్యాలనే అనుకున్న పాణి, సంతకం చేశాడు.

చప్పున టేబిలు మీదున్న చెక్కు కాయితం లాగేసి 'వద్దు ఈ చెక్కు సంతకం చెయ్యొద్దు'' అంది పద్మావతి.

''చాలా అవసరమమ్మా," అన్నాడు ''నాకు తెలుసు, మీరు ఆయన్ని మోసం చేస్తున్నారు. ఆయన ఈ చెక్కుమీద సంతకం చెయ్యరు. ఇప్పటికి మీరు తిన్న డబ్బు చాలు" వెళ్ళండి, అంది పద్మావతి. ఆవేశంతో, అసహనంతో. ఏదో భయంతో, ఆమె గొంతు వణికింది.

''నేను మోసం చేస్తున్నానా? నన్ను వెళ్ళమనే దానవా నువ్వు?'' ఒళ్ళు తెలియని కోపంతో పద్మావతి చెంపమీద బలంగా కొట్టాడు రంగారావు.

"అమ్మా!" అని కళ్ళు మూసుకుంది పద్మావతి.

దెబ్బతిన్న పులిలా చివాలున లేచి నిల్చున్నాడు పాణి. తన ఎదురుగా పద్మావతి రంగారావుచేత అలా అవమానింపబడటం సహించలేని పాణి, కోపంతో నిలువెల్లా వణికిపోతూ. "రంగారావుగారూ!" అన్నాడు అరిచినట్లు.

"ఏదీ చెక్కు కాయితం ఇలా ఇవ్వు" అంటూ పద్మావతి చెయ్యిపట్టి గుంజాడు రంగారావు.

"నే నివ్వను" అంటూ ఆ కాయితం నలిపి చింపేసింది పద్మావతి.

అమ్మా! నువ్వెంతదానవు! అని నోటికొచ్చిన తిట్టుతిడుదూ, తాత్కాలికంగా, తనను తాను మరచిన రంగారావు, పద్మావతి జడ పట్టుకున్నాడు.

శబ్దాన్ని బట్టి వారెక్కడ ఉన్నారో గ్రహించిన పాణి చప్పున పద్మావతి చెయ్యి పట్టుకుని రంగారావు మీద చెయ్యి వేసి బలంకొద్దీ వెనక్కి నెడుతూ, రంగారావ్· యూ గెటవుట్. నా భార్యను నా ఎదురుగా అవమానిస్తావా? ఎంత ధైర్యం నీకు, వెళ్ళు. ఇంక క్షణం నా ఇంట్లో ఉండటానికి వీల్లేదు ఏ ఘూర్థా. ఏ అద్మికే లేజావ్. "అరిచాడు ఆవేశం కోపంతో నిలువునా వణికిపోతూ.

పాణి గొంతు విని, ఘూర్థా, అన్నపూర్ణమ్మా, అప్పారావూ అతని గదిలో అడుగుపెట్టేసరికి పెద్ద పెద్ద అంగ

లేసుకుంటూ అవతలి కెళ్ళి పోయాడు రంగారావు.

తన భుజం చుట్టూ చెయ్యివేసి తనను దగ్గరగా లాక్కుని కోపంతో మొహం కంది పెదవులదురుతూన్న పాణివైపు చూసిన పద్మావతి తల తిరిగిపోయింది. ఇతని భార్యనే నేను? అనుకునేసరికి

ఏమిటిది? ఎంతో వినయంగా రంగారావుగారంటే ఎంతో భక్తిగా గౌరవంగా మాట్లాడే పాణి ఇలా అతన్ని గెంటాడు. అని ఆశ్చర్యంగా చూస్తూన్నారందరూ అతనివైపు

ఏమిటి "జరిగింది బాబూ!" అంటి అన్న పూర్ణమ్మ.

తన తల ఆప్యాయంగా నిమురుతూన్న పాణిచెయ్యి తొలగించి తనను చుట్టుకున్న అతని ఎడమచేతిని విసురుగా తోసేసి, "అన్యాయం నేను మీ భార్యనా?" అంది పద్మావతి జలజలా చెంపలమీంచి కన్నీళ్ళు జారిపోతూంటే వణికే గొంతుతో.

అతను తలవంచి బాధగా నిట్టూర్చాడు. ఆమె కేమీ జవాబివ్వలేదు.

"నేను పేదదాన్ననీ, మీ ఆశ్రయంలో ఉన్నాననీ, నాకు డబ్బు పెట్టారనీ, మీ డబ్బుతో బ్రతుకుతున్నాననీ నా కెవరూ లేరనీ అలుసు తీసుకునే కదూ మీరు అలా అనడానికి సాహసించారు" రోషంతో దుఃఖంతో వణికిపోతూ అడిగింది పద్మావతి పాణిని.

"అహ. హ. కాదు. కాద." అని తల అడ్డంగా ఊపి, "మీరంతా అంటే పద్మావతి తప్ప మిగతావారు అవతలికి వెళ్ళవచ్చు," అన్నాడు పాణి గంభీర స్వరంతో.

ఒక్కసారి అతనివైపు చురుగ్గా చూసి వెనుదిరిగి నెమ్మదిగా తన గదిలోకి వెళ్ళిపోయింది అన్నపూర్ణమ్మ. అప్పారావు, ఘూర్ఖా కూడా వెళ్ళిపోయారు.

"పద్మావతీ!" ఆప్యాయంగా పిలిచాడు పాణి.

ఆమె పలకలేదు సన్నగా ఏడుస్తూన్న శబ్దం.

"పద్మావతీ! కంగారు పడకండి పద్మావతీ! ఛ, ఛ, ఏడుస్తారెందుకు?" లాలనగా అన్నాడు మళ్ళీ

"ఏడవక ఏంచెయ్యాలి? నేను మీ భార్యనా?" అసహనంగా కోపంగా అతని వైపు చూస్తూ అడిగింది పద్మావతి.

"జీవితకాలంలో ఎప్పుడూ మీకు అలా చెప్పగూడదనుకున్నాను. కాని ఒక్క క్షణికమైన ఆవేశం నన్ను వివేక శూన్యుణ్ణి చేసింది. ఆ రంగారావు మీ మీద అలా చెయ్యి వేసుకుంటే సహించలేకపోయాను. మనస్సు మండిపోయింది. నన్ను నేను నిగ్రహించుకో లేకపోయాను చప్పున అలా అనేశాను. ఈ నిజం జీవితంలో ఎప్పుడూ మీ ఎదుట బయటపెట్టకూడ దను

కున్నాను. కాని క్షణికావేశంతో నా నిర్ణయం సడలిపోయింది. హు కోపం మనిషిని ఎంత ఆలోచనారహితుణ్ణి చేస్తుంది? ఈ సంఘటన, నామాట కలలా విస్మరించండి పద్మావతీ! అన్నాడు పాణి అస్థిమితంగా, అటూ ఇటూ పచార్లు చేస్తూ, నెమ్మదిగా!

"ఏమిటో నా తల తిరిగిపోతూంది. మీరూ, మీ మాటలూ నాకేమీ అర్థం కావడంలేదు. ఎంతయినా, అంత గట్టిగా ధైర్యంగా నలుగురూ వినేలా నన్ను మీ భార్యనవి ఎలా అనగలిగేరు! ఎంత సాహసం!"

"సాహసమేంకాదు. నిజమే. నువ్వు నా భార్యవే!"

"చక్రపాణిగారూ!...అసలు నాకు పెళ్ళికాలేదు," అంది అతను తన నేదో వంచించాలని చూస్తున్నాడనుకున్న పద్మావతి రోషంగా.

"నిజంగా మీకు పెళ్ళి కాలేదా? పద్మావతి చెప్పింది"

"లేదు" ఆమె నొక్కి చెప్పింది.

క్షమించండి పద్మావతీ! రంగారావు గారెందుకీ అబద్ధం చెప్పి ఉంటారు నాకు లేక మీరే నా భార్య పద్మావతి అనుకున్నారో! మీరు చంద్రశేఖరంగారి అమ్మాయి కాదా! మీకు చిన్నతనంలో పదమూడవ ఏట నల్లద్దాల కళ్ళజోడు అబ్బాయితో పెళ్ళి కాలేదా! ప్రశ్నించాడు సూటిగా.

ఆమె గతుక్కుమన్నట్టయి తెల్లబోయి అతనివైపు చూస్తూ, మౌనంగా ఉండిపోయింది.

రెండు క్షణాల తర్వాత "భయపడకండి పద్మావతీ! భర్తననే అధికారంతో మీనుంచి నేను ఏమీ కోరను" అన్నాడు పాణి.

"కాదు, కాదు. మీరు నా భర్తకాదు. నా భర్తకు అందమైన విశాలమైన కళ్ళున్నాయి. నా భర్త అంధుడు కాడు. నా భర్త అందమయినవారు. ఆయన్ని నేను మా పెళ్ళిలో ఒక్కరోజు మాత్రమే అయినా బాగా చూశాను. ఆయన రూపం నా హృదయంలో ముద్ర వేసుకుంది. ఆయన ఎక్కడ ఉన్నా ఎలా ఉన్నా ఆయన్నే ఆరాధిస్తున్నాను. మరొక వ్యక్తిని నేను భర్తగా ఊహించ నన్నాలేను. నమస్కారం పాణీగారూ మీరు నా భర్తకాదు. నన్ను వంచించాలని చూడకండి." చేతులు జోడించి అతనికినమస్కరిస్తూ వెక్కి వెక్కి ఏడవసాగింది పద్మావతి

ఆమె దృష్టిలో వంచితుడిగా గుర్తింపబడడం ఇష్టంకాని పాణి. నిజం తెలియజెయ్యాలనే నిర్ణయానికి వచ్చాడు. పద్మావతీ బాధపడకండి అని క్షణం తర్వాత బరువుగా నిట్టూర్చి. మీరు సీతారామయ్యగారింట్లో దీనంగా బ్రతుకుతున్నారని రంగారావుగారు చెప్పినప్పుడే, మీ భర్తగా ఆదుకోవాలని, మీరు నన్ను

భర్తగా సహిస్తారనీ అనుకోలేదు. కాని వంచన చెయ్యడం నాకు చాతకాదు. వంచన అన్న పదమే నాకు అసహ్యం. అలానే అబద్ధం కూడా నాకు ఇష్టం కాదు. అయితే మీరు మళ్ళీ పెళ్ళిచేసుకుని సుఖపడాలని మనసారా కోరుకున్న నేను, మీ భర్తను నేనని చెప్పలే దెప్పుడూ. కానీ మీరు నేనూ భార్యాభర్తలమైన మాట నిజం. ఓ దురదృష్టపు విషపుఘడియలో మన వివాహం జరిగిపోయింది.

"లేదు. లేదు. నేను నమ్మను. నా భర్త గుడ్డివారు కాదు ఆమె దుఃఖం ఉదృతమయింది. నిస్త్రాణగా గోడకి జేరబడి కూర్చుంది."

"ఏడవకండి పద్మావతీ! మీతోనాకు ఎటువంటి సంబంధమూ ఉండదు మీ ఇష్ట మొచ్చినచోటికి మీరు వెళ్ళిపోవచ్చు మీకు ఇష్టమైన వ్యక్తిని వివాహమాడవచ్చును. తెలిసీ తెలియని వయస్సులో, ఒక మాయతో, వంచనతో జరిగిపోయింది మన వివాహం, అన్నాడు పాణి శబ్దాన్ని బట్టి ఆమె దగ్గరగా నడిచి ఆమె పక్కన తానూ చతికిలబడి క్రింద కూర్చుంటూ.

దుఃఖ వివశ అయిపోయిన పద్మావతికి తన చుట్టూ ఉన్న భూమంతా తిరుగుతూన్నట్టనిపిస్తూంది. ఒకనాడు తన తండ్రి మతిచలించి ఎటో పోయాడని చెప్పిన తన భర్త పాణా. పిచ్చి వాడికి బదులు గుడ్డివాడా! అతనితో తనకి జీవితంలో ఇహ ఏముంది? ఈ హఠాత్ సంఘటన, రంగారావు తనపై చెయ్యిచేసుకోవడం, పాణి తనను భార్య అని ధృవపరచడం, ఇంకా పూర్తిగా ఆరోగ్యం చిక్కి కోలుకొని పద్మావతి తెలివితప్పి పాణి వడిలోకి ఒరిగిపోయింది.

అలా తన వడిలో వాలిపోయిన పద్మావతిని చేతుల్తో చుట్టి పట్టుకుంటూ 'అత్తయ్యా, అప్పారావ్! కొంచెం నీళ్ళు తీసుకురా! అన్నాడు పాణి కంగారుగా!'

మళ్ళీ అన్నపూర్ణమ్మా, అప్పారావూ వచ్చా రక్కడికి. తడి చేత్తో పద్మావతి మొహం, కళ్ళూతుడుస్తూ 'దుర్మార్గుడు నిన్నెంత హింసపెట్టాడే తల్లి' అంది అన్నపూర్ణమ్మ.

"మరి కాస్సేపు ఉన్నాడు కాదు చంపేద్దును, అన్నాడు పాణి."

''ఛీ. నోర్ముయ్. అతన్ని చంపడం? ఇల్లాలికి భార్యకి ఉద్యోగ మిచ్చావు. పైపెచ్చు మరొకణ్ణి పెళ్ళిచేసుకు వెళ్ళిపో అంటూన్నావు. ఆ పిల్లకి మొహం తిరిగిందంటే తిరగదూ!"

"అత్తయ్యా, విన్నావా అన్నీ.? డాక్టరుని పిలుద్దామా! ఎలా ఉంది తెలివి వస్తుందా?" పద్మావతి తలని నిమురుతూ అన్నాడు పాణి

"నువ్వు కాస్సేపు నోరుమూసుకో.

తెలివి వస్తుంది," అని పద్మావతి కళ్ళపై చల్లటి తడిచేత్తో తుడుస్తూ "అమ్మాయ్ పద్మా ? ఏదమ్మా కొంచెం నోరు తెరు అంది పద్మావతిని.

నాలుగైదు నిమిషాల తర్వాత కళ్ళు తెరచింది పద్మావతి. తన తలా పళ్ళు పాణి వడిలో. చివాలున లేచి కూర్చుంటూ "చక్రపాణిగారూ ! నేను మీ భార్యనే అని ఋజువు చెయ్య గలరా ?" అడిగింది సూటిగా ! ఆమె గొంతులో ఇందాకటి వణుకులేదు. నిశ్చలంగా గంభీరంగా ధ్వనించింది.

"ఎందుకు పద్మావతీ ! పోనీ కాదను కోండి. మీరంత కంగారుపడవలసిం దేమీ లేదు. రెస్టు తీసుకోండి. హైరానా పడకండి " అన్నాడు పాణి.

"అయితే ... అయితే. రంగారావు గారింటికి వెళ్ళి ఆయన్ని అడగనా !"

"మీ ఇష్టం "

"ఆ రంగారావు ఈసారి నన్ను చంపేస్తాడు. మీ కేమీ అభ్యంతరం లేదా !"

"మనిషిని చంపడం అంత తేలికైన పని కాదు.

"రంగారావుకి తేలికే."

"అప్పారావ్ అవతలి వెళిపోళ్ళి" అన్నాడు పాణి.

"అమాత్రందానికి ఇందాక ఎందు కంత ఆవేశపడిపోయారు ? నా ఇష్టా నికి వదిలెయ్యకపోయారా !" అని నీర్సంగా నవ్వి, అలా క్రిందనే పడు కుంది పద్మావతి.

"అలా మంచంమీద పడుకో అమ్మాయ్" అంది అన్నపూర్ణమ్మ.

"వద్దు. చల్లగా ఉంది."

"తల కింద దిండు పెట్టు. కాస్సేపు తనని మాట్లాడించకు." అని నెమ్మదిగా అవతలికి వెళ్ళిపోయాడు పాణి.

పద్మావతి తల కింద దిండు పెడ్తూన్న అన్నపూర్ణమ్మని, "మీ ఆరోగ్య మెలా ఉంది ?" అడిగింది పద్మావతి.

ఇవ్వాళ జ్వరం రాలేదు. అని సన్నగా మూలుగుతూ "పడుకో అలా" అని అవతలి కెళ్ళిపోయింది అన్నపూర్ణమ్మ.

మరి కొంచెంసేపటికి హార్లిక్సు తెచ్చి పద్మావతి కిచ్చింది అన్నపూర్ణమ్మ.

పదకొండు గంటలకు "అమ్మగారూ! అయ్యగారు భోజనం గదిలోకి రమ్మం టున్నారు," అని అప్పారావు పిలవ డంతో డైనింగ్ రూమ్‌లోకి వెళ్ళింది పద్మావతి.

అన్నపూర్ణమ్మ లేదా గదిలో. ఎవరో కొత్త వ్యక్తి ఇద్దరికీ భోజనం వడ్డిం చాడు. అప్పటికే పాణి ఓ కుర్చీలో కూర్చున్నాడు. అడుగుల సవ్వడి గాజుల శబ్దాన్ని బట్టి పద్మావతి ఆ గదిలోకి వచ్చిందని గ్రహించాడు పాణి.

మౌనంగా భోజనం ముగించా

రిద్దరూ ! పాణి వెనుకే అతని గదిలో కెళ్ళింది పద్మావతి.

ఆమె తన వెనుక వస్తూందని గ్రహించాడు పాణి పడమటి గదిలో విశ్రాంతి తీసుకోండి పద్మావతీ !" అన్నాడు.

"విశ్రాంతా !" అని నవ్వి, "సందేహ నివృత్తి కానిదే విశ్రాంతి ఎలా లభి స్తుంది ?" అంది.

"మరొకసారి అంతా చెబుతాను లెండి. ఇప్పుడు మీరు చాలా వీక్‌గా ఉన్నారు.

ఫర్వాలేదు. ఇప్పుడు మీరు ఏం చెప్పినా వినడానికి సిద్ధంగానే ఉన్నాను, చెప్పండి."

తానొక కుర్చీలో కూర్చుని, ' వక్క పొడి ఇస్తారా ?" అడిగాడు పాణి.

ఆమె టేబిలు మీదున్న సీసాలోని వక్కపొడి కొంచెం అతని చేతిలో వేసింది.

వక్కపొడి నములుతూ "మీరూ కూర్చోండి" అన్నాడు పాణి

అతని ఎదర కుర్చీలో కూర్చుని. అతనిలో ఓనాడు తన మెడలో తాళి కట్టిన పద్దెనిమిదేళ్ల అబ్బాయి పోలికలు వెతుకుతూంది పద్మావతి.

చిన్నగా దగ్గి గొంతు సవరించు కొని, 'మీరు కూర్చున్నారా ? మన ఇద్దరం తప్ప మరెవరూ గదిలో లేరు కదూ !' అన్నాడు పాణి.

"లేరు, చెప్పండి" అంది పద్మావతి.

అతను ఏం చెప్పబోతున్నాడిప్పుడు ? ఆమె హృదయం తీవ్రంగా స్పందించ సాగింది.

"చంద్రశేఖరం గారని ఒకాయన మా ఇంటికి తరుచు మా నాన్నగారి దగ్గరకు వస్తూ ఉండేవారు అని ఆగాడు పాణి.

ఆ మాట వినగానే త్రుళ్ళిపడ్డట్టు కదిలి మళ్ళీ సరిగ్గా కూర్చుంటూ చంద్ర శేఖరం అంటే మా నాన్నగారు కాదు కద, అనుకుంది పద్మావతి.

నాకు అప్పుడు చిన్నతనం. సరిగ్గా ఏమీ తెలియదు. అతను వచ్చినప్పు డల్లా నాన్నగారి దగ్గర డబ్బు అడిగి తీసుకొని వెళ్ళేవాడు. నాన్నగారెందుకో అతన్ని మందలిస్తూ ఉండేవారు. వారి మాటలు వినాలని ఒకసారి వారి దగ్గరే కూర్చున్న నన్ను, 'పాణీ! చంద్రశేఖరం మామయ్యకు కాఫీ పట్రా!' అని పంపిం చేసేరు నేను కాఫీ కప్పుతో తిరిగి వచ్చే సరికి చంద్రశేఖరంగారు లేరు.

'ఆయన వెళ్ళిపోయారా ?' అని అడి గాను మా నాన్నను. ఇంతలో అత్తయ్య కూడా అక్కడికి వచ్చింది 'ఎవరు వచ్చారు ?' అంటూ.

"చంద్రశేఖరమమ్మా. వట్టి జులాయిలా తయారయ్యాడు. భార్య పోయినవారిని చాలామందిని చూశాను. కాని వీడిలా ఇంత దిగజారిపోయినవాణ్ణి మాత్రం నేను చూడలేదు," అన్నాడు నాన్న.

"మళ్ళీ డబ్బుకోసం వచ్చి ఉంటాడు అవునా?" అంది అత్తయ్య.

"అవును," అన్నారు నాన్న ముభావంగా.

"బాగుందన్నయ్యా! ఎందుకలా ఇస్తావు? అసలు డబ్బిచ్చి నువ్వే అతన్ని పాడుచేస్తున్నావేమో; నువ్వు డబ్బివ్వడం మానేస్తే ఏదన్నా ఉద్యోగం చూసుకుంటాడు." అంది అత్తయ్య కొంచెం చంద్రశేఖరంగారి మీద కోపంతో విసుగ్గా.

"ప్చ్. పాపం. అలా డబ్బివ్వడం మానేశాను కొన్నాళ్ళు. నువ్వన్నట్లు ఉద్యోగం చూసుకొని స్థిరపడతాడని. కాని మరీ ముష్టివాడిలా తయారయి వచ్చాడు మళ్ళీ నా దగ్గరకు. ఏడ్చాడు. ఏం చెయ్యమన్నావు?" అన్నారునాన్న.

"డబ్బిస్తావంటే చాలామంది ఏడుస్తారు," అంది అత్తయ్య.

"అందరికీ ఎందుకిస్తాను? వాడు నా చిన్ననాటి స్నేహితుడు. బాగా బ్రతికి చెడ్డవాడూ కనుక. అయినా వాడు నన్ను అడిగి తీసుకుపోయే డబ్బు వాడికోసం కాదు వాడికో కూతురుంది. ఆ కూతురంటే వాడికి ప్రాణం. ఆ పిల్లని ఎక్కడో చదువుకి పెట్టాడట. ఆ అమ్మాయికి బట్టలు కొనాలనీ ఆ పిల్లకు ఇవ్వాలనీ అడుగుతాడు. ఎలా లేదనను చెప్పు?" అన్నారు తేలిగ్గా నవ్వేస్తూ. నేనేమీ అడగకుండానే అన్ని వివరాలూ తెలిసాయి వారి సంభాషణలో. వింటున్నారా?" అన్నాడు పాణి.

"వింటున్నాను. ఆ యాచకుడు మా నాన్న. ఆ అనాథ పిల్లను నేను."

"మీరు ఇన్నాళ్లు పిలవుతే మరి చెప్పను."

"ఇన్నాళ్లెందుకు? నాకు తెలియని విషయాలు తెలుసుకుంటున్నాను. చెప్పండి!"

ఆ చంద్రశేఖరంగారికి నాటకాల పిచ్చి ఉందనీ, మరెన్నో వ్యసనాలకి అలవాటు పడిపోయాడనీ నేను చెప్పక్కర్లేదనుకుంటాను. ఆయన తరుచుగా వచ్చి డబ్బివ్వమని మా నాన్నను వేడించి తీసుకుపోయేవారు.

"తర్వాత నేను బి. ఎస్‌సి. చదివేటప్పుడు నా కళ్లకి జబ్బు వచ్చింది. నాన్న డాక్టర్లచేత పరీక్షలు చేయించేవారు. నేను ఇంట్లోనే ఉండేవాడిని. కనీసం షికారుకి కూడా వెళ్ళనిచ్చేవారు కాదు, అట్టే గాలీ, వెల్తురూ కళ్ళకి పనికి రాదనేవారు. కళ్ళు కనిపిస్తూన్నప్పుడే పంజరంలో చిలుకలా ఈ ఇంట్లో బందీనయిపోయాను." అని ఆగాడు.

మౌనంగా నాలుగు క్షణాలు దొర్లాయి. అతని మౌనాన్ని సహించలేనట్టు, "ఊ. చెప్పండి! తర్వాత" అంది పద్మావతి.

"ఆవేళ చంద్రశేఖరంగారు. మాసిన పాంటూ, చిరిగిన చొక్కాతో

మధ్యాహ్నం పన్నెండు గంటలవేళ మా ఇంటికి వచ్చారు. అతన్ని ఎప్పుడూ చూడనంత ఆదరంగా చూశారవాళ మా నాన్న. అతన్ని స్నానంచెయ్యమని తన గ్లాస్కో పంచా లాల్చీ బనియనూ తొడుక్కోమని ఇచ్చారు. అతని పంక్తిన కూచుని భోజనం చేశారు. ఆయనతోపాటు నా గదిలోకి వచ్చి కూర్చున్నారు మా నాన్న. అలా ఆ ఇద్దరూ వచ్చి సోఫాలో కూర్చుంటే పడుకున్నవాడినల్లా కంగారుగా లేచి కూర్చున్నాను. పూర్ణ ఆకులూ, వక్కలూ ఉన్న పళ్లెం తెచ్చి వారి మధ్య పెట్టాడు. ఇద్దరూ ఆకులకు సున్నం రాసి ఈనెలు తీసి వేసుకుంటు న్నారు. 'పాణి కాలేజీకి వెళ్లటం లేదా?' అడిగారు చంద్రశేఖరంగారు. 'ఈమధ్య వాడి ఆరోగ్యం అంతగా బాగులేదు.' అని పొడిగా జవాబుచెప్పి 'మీ అమ్మాయి వయస్సెంత?' అని ప్రశ్నిం చారు నాన్న.

"పదమూడు" అన్నాడతను

"ఎలా ఉంటుంది ?" అని అడిగారు నాన్న నవ్వుతూ.

"సవ్యవాణిలా ఉంటుంది అన్నా డతను.

"ఓ అంత అందంగా వుంటుందన్న మాట" అంటూ అర్థవంతంగా నవ్వారు నాన్న.

అతనుమౌనంగా తలవంచుకున్నాడు.

"ఏమిటి చదువుతూంది ?" నాన్న ప్రశ్న.

"ఫోర్తుఫారం." అతని జవాబు.

ఆ తర్వాత వ్యాపార విషయాలు ఈయన చెబుతూంటె నాటకాలవిష యాలుఅతను చెప్పాడు. ఇద్దరూ కాసేపు మాట్లాడుకొని అవతలి కెళ్ళిపోయారు. అస్సలు నా గదిలోకి ఎందుకు వచ్చారో ఎందుకు వెళ్లిపోయారో నాకు అర్థం కాలేదు మరో గంటతర్వాత చంద్ర శేఖరంగారు వెళ్ళి పోయారు. నాన్న అతనికి ఆరువేలరూపాయలు ఇచ్చారట అత్తయ్య నాన్నను సన్నగా మందలి స్తోంది. నాన్న నవ్వేసి వీధిలో కెళ్ళి పోయారు. మానాన్న అత్తయ్య మధ్య అన్నా చెల్లెళ్ళ అనుబంధం చిత్రంగా ఉండేది. అత్తయ్య చాలా జాగ్రత్తయిన మనిషి, తెలివైనదికూడా. కాని ఏ పని చేసేటప్పుడయినా స్వతంత్రించేది కాదు. అన్నయ్య ఏమంటాడో అని భయపడేది. అలాగె నాన్నకూడా ఎవరికన్నా డబ్బు ఇచ్చేసి అన్నపూర్ణ కోప్పడుతుంది, అని ఆమెను తప్పించుకు తిరిగేవారు.

ఆ రాత్రి నాన్నా నేనూ భోజనం చేస్తు న్నాం. అత్తయ్య వడ్డనచేస్తూంది. పాణీ నీకు ఒక వారంరోజుల్లో పెళ్లిచెయ్యాలని చూస్తున్నానా! అన్నారు నాన్న. అలా అంటున్నప్పుడు ఎందుకో ఆయనగొంతు చలించింది.

తెల్లబోయాను, నాకు పెళ్లా! అని. వెంటనే 'నాకిప్పుడు పెళ్లొద్దు నాన్నా! నేను చేసుకోను.' అన్నాను ఖచ్చితంగా.

తర్వాత పెళ్ళికి వప్పుకుని తిరాలని ఆయనా, వద్దని నేనూ వాదించుకున్నాం. అన్నంలో చెయ్యి కడిగి లేచిపోయాను

ఆ రాత్రి నాన్న నా ప్రక్కలో కూర్చుని నన్ను బ్రతిమిలాడి నచ్చ జెప్పి, నేను మొండికెయ్యడంతో. ఒక అస్త్రం ప్రయోగించారు. అదేమిటో ఎలా అబద్ధమాడారో తెల్సా? తనకు గుండెనొప్పి వస్తూందనీ, ఎన్నో రోజులు జీవించను కనుక, కోడలు రావాలనే కోరిక ఉందని ఓ రకంగా ఏడ్చారు. నేను చలించిపోయాను. నిజంగా మా నాన్న చచ్చిపోతారనే భయంతో ఆతృ తగా పెద్దడాక్టరి కెవరికైనా చూపించు కోండి అన్నాను. 'భయపడకు నాన్నా! నేనూ జీవించాలనే కోరుకుంటున్నాను. కాని దైవనిర్ణయ మెలాఉందో! అందుకని' అంటూ నా మొహంలోకి చూశారు. 'ఆ సమయంలో ఆయన కోరిక ఏదైనాసరే తీర్చాలనే నిర్ణయానికి వచ్చాను. ఆ అమ్మాయి ఎవరు? ఎలాఉంటుంది?' అని అడిగాను బిడియంగా. 'చంద్రశేఖరం కూతురు' అందంగానే ఉంటుంది. అన్నారు నాన్న. చంద్రశేఖరంగారూ నాన్నా మధ్య దొర్లిన సంభాషణలో ఆ అమ్మాయి అందమైనదని విన్నాను కాబట్టి నా మనస్సులో ఏవో మధురమైన అందమైన ఊహలు కదలసాగాయి

నాన్నగారు చెప్పిన పెళ్ళిరోజు దగ్గర పడుతూంది. కాని మా యింటి ముందు పందిరి వెయ్యలేదు.

బంధువులెవరూ రాలేదు. పెళ్ళి పనులని ఇంట్లో హడావుడి ఏమీలేదు. గలగలా సందడిగా తిరిగే అత్తయ్య ఎందుకో ముభావంగా, గంభీరంగా మారిపోయింది. అత్తయ్యనీ, నాన్ననీ ఏ వేవో ప్రశ్నించి తెలుసుకోవాలనుకునేవాణ్ణి, కాని, అదేదో బిడియం గొంతుపెగిలేదికాదు రేపు నా పెళ్ళి అనగా, నా పెట్టె, బట్టలూ అన్నీ నాన్న సర్దారు. ఎక్కడికి తీసుకు పోతారో ఎవరింటికో ఏమిటో అంతా అయోమయంగా ఉంది నాకు. సాయంత్రం ఆరుగంటలకు నన్ను పిలిచి 'బాబూ ముఖం కడుక్కొని బట్టలు వేసుకొని దేవుడికీ, మీ అమ్మ ఫొటోకీ నమస్కరించి రా, ఎక్కడికి? ఏమిటి? అని ప్రశ్నించకూడదు' అన్నారు. ఆయన గొంతు ధ్వనించిన తీరులో ఏదో మహత్కార్యం చేయబోతూన్నప్పటి గంభీరత తప్ప కొడుకు పెళ్ళి అనే సంతోషం, ఉత్సాహం లేవు. ఆయన చెప్పినట్టుగా చేసివచ్చాను. వీధిలో రోడ్డు మీద టాక్సీ ఉంది. ముందు ఆయనా, వెనుక నేనూ వీధి గేటుదగ్గర కొచ్చాం. దాసీది నీళ్ళ కడవ నెత్తిన పెట్టుకుని ఎదురయ్యింది. నాన్న ముఖమెందుకో వికసించింది. వెయ్యి జ్యోతులకాంతి మెరసింది అతని కళ్ళల్లో. భగవాన్ అని కళ్ళుమూసుకొని చేతులు జోడించి నమస్కరించి, నా చెయ్యి పట్టుకొని

టాక్సీ దగ్గరకు నడిపించారు." అని దీర్ఘంగా నిట్టూర్చి మౌనంగా ఉండి పోయాడు పాణి.

నాలుగు క్షణాల తర్వాత తీవ్రంగా స్పందించే హృదయాన్ని చిక్కబట్టి కంపన స్వరంతో. "తర్వాత...తర్వాత ఏం జరిగింది ?" అడిగింది పద్మావతి.

"కొంచెం మంచినీళ్లు కావాలి" అన్నాడు పాణి.

ఆమె కూజాలో నీళ్ళు గ్లాసులో వంచి అతనికి అందించింది.

గటగటా నీళ్లు తాగేసి, గ్లాసు కింద పెట్టి ముఖం రుమాలుతో తుడుచుకొని "తర్వాత ఏం జరిగింది ? ఆయన అనుకున్నదీ, నేను కోరుకోనిదీ ఓ అమ్మాయి మెడలో ఉరితాడు పడింది" అని నవ్వి, క్షణం తర్వాత మళ్లీ చెప్పడం ప్రారంభించాడు పాణి.

"టాక్సీలో నేనూ, నాన్నా, రంగారావుగారూ మాత్రమే పెళ్ళి జరిగే ఊరు వెళ్ళాము. అక్కడ బంధువులూ, మిత్రులూ హాజరై ఉంటారనుకున్నాను. ఎవరూ నాకు తెలిసిన వ్యక్తులే కనుపించలేదు. ఎంతో ఘనంగా ఆర్భాటంగా, ఏకైక పుత్రుడికి జరపబోయే వివాహం నాన్న ఎందుకింత గుట్టుగా, నిరాడంబరంగా చేస్తున్నారో నాకు అర్థం కాలేదు. పైగా బాధపడ్డాను కూడా. నా కెంతమందో ఫ్రెండ్సున్నారు. వారందర్నీ పిలిచి గొప్పగా పంక్షనివ్వాలనుకున్నాను. నాన్నగారి కోరికకోసం ఇంత తొందరగా పెళ్ళిచేసుకుంటున్నానని చెప్పి, అందమైన నా భార్యను వారికి పరిచయం చెయ్యాలనుకున్నాను. ఇంకా ఇంకా నాకు జరగబోయే వివాహం గురించీ, నాకు శ్రీమతిగా రాబోయే అమ్మాయి గురించీ ఎన్నో తియ్యటి ఊహలూ, ఆలోచనలూ ఉండేవి. అదంతా సోది, ఇప్పుడెందుకులెండి. అలాటి ఊహలు నా దరిదాపుల్లో చేరకుండా నా జీవితమెప్పుడో మొద్దుబారిపోయింది

ఇహ మా వివాహం. మేము టాక్సీ దిగగానే చంద్రశేఖరంగారు ఎదురై నాన్నగారి చెయ్యిపట్టుకొని స్నేహపూర్వకంగా నవ్వి, నన్ను పలకరించి మా కోసం ఏర్పాటుచేసిన బసకి తీసుకుపోయారు. మా స్నానాలూ, భోజనాలూ అయ్యాయి. కాస్సేపు మాట్లాడి చంద్రశేఖరంగారు లేచి నిల్చుని వెళ్లబోతూంటే 'పద మేమూ వస్తాము. కోడల్ని చూపించు' అన్నారు మా నాన్న నవ్వుతూ. నేనూ ఆ అమ్మాయిని చూడాలనే కుతూహలంతో లేచి నిల్చున్నాను. 'బాబూ! నువ్వు రెస్టుతీసుకో, ఇప్పుడే వచ్చేస్తాము' అని నాన్నా, రంగారావుగారూ అతనితో వెళిపోయారు. నాకు మాత్రం ఆ అమ్మాయిని చూపించడం అవసరం లేదా ? అనిపించింది నాకు కోపంవచ్చింది కూడా. కాని ఏంచేస్తాను.

అప్పటికి రాత్రి పదకొండు గంటలయి పోయింది మరి కొంచెంసేపు గడిచే సరికి నా కళ్లు విపరీతంగా బాధపెట్ట సాగాయి. సన్నగా మూలుగుతూ మంచంమీద బోర్లాపడుకున్నాను. అర గంట తర్వాత నాన్నా, రంగారావు గారూ వచ్చారు. నాన్న అంటున్నారు. 'రంగా అమ్మాయి చాలా బాగుంటుంది కదూ!' అని. పాపం చిన్న పిల్ల. ఊరికే కుదిపేస్తాడు శేఖరం నిద్రపోయిన దాన్ని పట్టుకొని అన్నారు నవ్వుతూ రంగారావుగారు. ఎందుకో నాకు విప రీతంగా కోపం వచ్చింది. "ఇదేం పెళ్ళి నాన్నా ? కనీసం అత్తయ్యనూ, శశినీ కూడా తీసుకురాకుండా. నా కళ్ళు ఒకటే బాధపెడుతున్నాయ్. నే నిలాటి పెళ్ళి చేసుకోను. నన్ను ఇంటికి పోనివ్వండి, అన్నాను చప్పున లేచి నిల్చుంటూ.

"ఇంకొక్కరోజు. రేపు ఒక్కరోజు నా మాట వినవూ ! నా గౌరవం కాపా డవూ ! బాబూ ! అని గెడ్డంపుచ్చుకు బతిమిలాడసాగారు. ఆయన మాట కాదనే ధైర్యం నాకు లేదప్పుడు. తెగించి అక్కడనుంచి పారిపోయే సాహసమూ లేదు. మళ్ళీ మౌనంగా మంచంమీద కూర్చున్నాను "

"తర్వాత నా కళ్ళు మంటలు పెట్టే టప్పుడు ఉపశమనానికి వాడేమందు నా కళ్లల్లో వేశారు నాన్న. కళ్ళు మంటలు తగ్గాక అలసటగా నిద్ర పోయాను.

మర్నాటి ఉదయం పెళ్ళికొడుకుని చెయ్యడం, ఒక బ్రాహ్మణ ముత్తయిదువ నా తలమీద అక్షంతలు జల్లి నూనె పెడుతూంటే నా కళ్లల్లో నీళ్ళు తిరి గాయి. అంతకి రెండేళ్లక్రితమే నాన్న నాకు వడుగుచేశారు. అప్పుడు బంధు వులూ, స్నేహితులూ, చాలామంది హాజ రయ్యారు. మా శశి పట్టుబట్టల్తో సంతో షంగా పందిట్లో తిరిగింది. మరొకసారి మళ్ళీ మా నాన్నగారిమీద నాకు కోపం వచ్చింది. తర్వాత యధావిధిగా పెళ్ళి తతంగం జరిగింది ధర్మరాజు పట్టాభి షేకంలా నా పెళ్ళికి బంధువులూ, స్నేహితులూ లేరు. అదంతా గబగబా సినిమా రీలులా జరిగిపోయింది పద్మా వతీ !" అని క్షణం ఊపిరి పీల్చుకొన డానికి అన్నట్టు ఆగాడు పాణి.

ఆమె మౌనంగా తలవంచి కూర్చుంది. మునపటిలా పాణి ముఖం లోకి చూడలేకపోతూంది.

"కేశవస్వామి ఆలయ ప్రాంగణంలో అడుగుపెట్టగానే పసుపుపచ్చని పట్టు పరికిణీలో పసిడిబొమ్మలాటి అమ్మాయి నా దృష్టిని చెదరగొట్టింది. ఆమె ముఖంలోకి నేను చూడగానే ఒక్కసారి ఒక్కక్షణం నా చూపుల్తో తన చేపల్లాటి మెరిసే కళ్ళు కలిపి సిగ్గుగా తల వంచేసింది. ఆ అమ్మాయి సిగ్గుమాస్తే

నాకు నవ్వు వచ్చింది పెళ్ళంటే మొగు డంటే సిగ్గుపడటం తప్పించి, మరేమీ తెలియని వయస్సులోని ఆ అమ్మాయి అమాయకంగా ముగ్ధలా నా పక్కన పీటమీద కూచుంటే నాకూ బిడియమని పించింది. హడావుడిగా బ్రాహ్మణులు మంత్రాలు చదువుతూంటే పెద్దల ఆదే శానుసారం ఆ అమ్మాయి మెడలో తాళి కట్టాను ఆ అమ్మాయి నా స్వంతమనే భావన ఆ క్షణంలో నన్ను ఆనందంతో వివసుణ్ణిచేసింది. ఆ రాత్రి పెళ్ళి తతంగం ముగిసి భోజనాలకి కూర్చునే సరికి పదిగంటలు దాటింది అని, పద్మా వతీ ! ఒక కాశీమజిలీ కథలా చెబు తున్నానులా ఉంది. విసుగ్గా ఉందా ? అడిగాడు పాణి నవ్వుతూ.

"లేదు చెప్పండి. అందామె నెమ్మదిగా."

"మా తిరుగు ప్రయాణం మర్నాటి మధ్యాహ్నం అన్నారు నాన్న! ఆ అమ్మాయి కూడా మాతో వస్తుందను కున్నాను. కాని మా ముగ్గురి ప్రయా ణానికే పెట్టెలూ అవీ సర్ది మాట్లాడు కోవటం గ్రహించి ఇక ఆగలేక "నాన్నా ! ఆ అమ్మాయి మనతో రాదా !" అడిగాను. 'రాదు' అన్నా రాయన. అల్లా పీల్లేమ. తీసుకువెళ్దాం చంద్రశేఖరంగారితో చెప్పండి. శశీ అత్తయ్యా మాత్రం తనను చూడొద్దూ ! అన్నాను ధైర్యంచేసి. "చూస్తార్లే బాబూ, తర్వాత." అని తేలిగ్గా నవ్వే శారాయన.

"అహ, ఇప్పుడే మనతో తీసుకు పోదాం, అక్కడే ఉంటుంది" అన్నాను.

నవ్వుకుంటున్నారు నాన్న, నాకు జవాబివ్వకుండా.

"ఏమిటంటారు ? తీసుకువెళ్దామా?" రెట్టించాను.

ఆయన వదనం గంభీరంగా మారి పోయింది. "వద్దు బాబూ ! చదువు కుంటూంది. ఆ అమ్మాయి కాస్త విద్యావంతురాలయ్యేవరకూ అక్కడే ఉండాలి అన్నారు.

"ఆ అమ్మాయిచేత ఉద్యోగం చేయి స్తారా?" అని అడిగాను. నాలో సహనం క్షీణించిపోతూంది.

"అహ చేయించను" అని బరువుగా నిట్టూర్చి "ప్చ్. పాపం నేనొక కఠినుణ్ణి బాబూ ! నా కర్తవ్య నిర్వహణకోసం, మన స్వార్థంకోసం ఆ ముక్కుపచ్చ లారని పసిదాని మెడలో నీ చేత తాళి కట్టించాను. ఆ పిల్ల తలపై పెద్ద భారం ఉంచాను. మన వ్యాపార విషయాలూ, నిన్నూ, నీ ఇల్లూ, చూసుకునేశక్తి విద్యావతిఅయితే సంపాదించుకుంటుంది. అందుకని అధమం ఆ అమ్మాయి స్కూలు ఫైనలయినా చదవాలి. తాళి కట్టించుకున్నాక తప్పించుకు పారి పోతుందా ?" అన్నారు నాన్న

"వ్యాపార విషయాలు నేను చూసుకో

లేనూ ! ఆ అమ్మాయే చూడాలా ? అనిపించినా ఇంకా ఆయనతో వాదించడం బిడియమనిపించి మౌనంగా ఉండి పోయాను. కాని...కాని ఆ అమ్మాయిని ఒక్కసారి మరొక్కసారి చూడాలని పించింది ఏమన్నా మాట్లాడాలని పించింది. అదివరకంతా ఆ అమ్మాయికీ నాకూ ఎటువంటి సంబంధమూ లేదు. ఎవరికెవరం ఏమీ కాము. కాని నేను కట్టిన తాళి బలమో, వివాహ మంత్ర బలమో ! మరి ఆ అమ్మాయికన్నా నాకు ప్రియమైన వారెవరూ కారనిపించింది. ఆలయంవైపు ఓసారి వెళ్లివస్తానని చెప్పి బయల్దేరాను. నేరుగా చంద్రశేఖరంగారున్న బసవైపు వెళ్ళలేకపోయాను. కేశవస్వామి ఆలయంలోకి వెళ్ళాను. యాంత్రికంగా దైవదర్శనం చేసుకుని ఇవతలికి వస్తున్నాను నీలం జరీపూల పట్టుపరికిణీ పొడవాటి నల్లని జడా, చివర బంగారు కుచ్చులూ గులాబిరంగు పట్టుజాకెట్టూ తలలో గులాబిపూలూ, చేతిలో ప్లాస్టిక్ సజ్జా, నందివర్ధనం పూలుకోస్తూ వెను దిరిగి నిల్చున్న ఆ అమ్మాయి కనుపించింది. గుండె ఎందుకో దడదడా కొట్టుకుంటూ ఉండే నెమ్మదిగా ఆ అమ్మాయి దగ్గరగావెళ్లి 'పద్మావతీ !' అని పిల్చాను.

"ఆ అమ్మాయి గతుక్కుమన్నట్టయి చివాలున నా వైపు తిరిగి నా వైపు ఒక్కసారి చూసి తలవంచి నిల్చుంది పోయింది. ఏం మాట్లాడాలో తోచటం లేదు నాకు. 'మేం వెళిపోతున్నాం అన్నాను, రెండు క్షణాలు మౌనంగా ఆ అమ్మాయిని చూసిన తర్వాత. ఆ అమ్మాయి మరొక్కసారి నా వైపు చూసీ చూడనట్టు చూసి తలవంచి మౌనంగా ఉండిపోయింది. కొన్ని క్షణాలు ఆ అమ్మాయి వైపలా పరవశంగా చూస్తూ నిల్చుండిపోయాను. వెళిపోవాలని కాబోలు నన్ను తప్పించుకుని గబగబా ముందుకి నడవబోయింది. ఆలయంలో పూజారితప్ప ఆ పరిసరాల్లో మరెవరూలేరు. ఆరె వెళిపోకు. ఏమిటి చదువుతున్నావ్ ? అంటూ ఆ అమ్మాయి చెయ్యిపట్టుకున్నాను. ఫోర్తు ఫామ్ అంటూ నా చెయ్యి విడిపించుకొని పరుగుతీసిందా అమ్మాయి. అంతే. అదే పద్మావతీ ! ఆఖరిసారిగా నా భార్యను నేను చూడటం ? అనుకున్నట్టూ ఆ మధ్యాహ్నం బయలుదేరి మా ఊరు వచ్చేశాం. నా పెళ్ళి సంగతి తర్వాత అత్తయ్యకూ. శశికీ అందరికీ చెప్పారు నాన్న. ఎందుకింత రహస్యంగా చేశావు ? అని అడిగిన అత్తయ్యకు జవాబు, శారాదాయాక్టు. చిన్న పిల్లలకు వివాహం చెయ్యకూడదు. అందులోనూ అతనిలాటి పెద్దమనిషి అస్సలు చెయ్యకూడదు. నాకు కోడల్ని చూడాలని పించి చేసేశాను అని. అత్తయ్య సంతో

షించింది శశి మాత్రం ఏడుపు మొదలు పెట్టింది. దానికే ఓ విలువైన నగలూ, బట్టలూ, కొని కానుకగా ఇచ్చారు నాన్న. అది అవేమీ పుచ్చుకోకుండా నన్ను పెళ్ళికి ఎందుకు తీసుకువెళ్ళ లేదు? నాకు వదినను ఎందుకు చూపించ లేదంటూ అలిగి పడుకుంది. నాన్న దానిని బ్రతిమిలాడి ఓదార్చారు. అది ఆ రోజు అన్నం తినలేదు. తర్వాత వారంరోజులవరకూ నాతో మాట్లాడటం మానేసింది పదిరోజులు పోయాక పెళ్ళి ఫొటోలు వచ్చాయి. అవి చూసి మా శశి మురిసిపోయింది. వదిన దానికెంతో నచ్చింది. నా కళ్ళు అప్పటికి మసగ మసగగా మాత్రమే చూడగలిగేవి. ఏదో విపరీతమైన బాధ కళ్ళల్లో. ఎప్పుడూ కళ్ళు తెరిచేవాడినేకాదు. చంద్రశేఖరం గారికీ, నాన్నకీ మధ్య ఉత్తరప్రత్యుత్త రాలు జరిగేవి. రెండునెలలు గడిచేసరికి నాకు కళ్ళు పూర్తిగా కనుపించడం మానేశాయి. నేనూ మా స్వజనం అందరం విషాదంలో మునిగి ఉన్నవేళ చంద్రశేఖరంగారు వచ్చారు. నాకేవో కానుకలు కూడా తెచ్చారు. నాకు కళ్ళు పోయాయని తెలియడానికి ఎంతో చైముపట్టలేదాయనకు. ఆయన కూడా ఏడ్చారనుకుంటాను. ఆయన ఇంక మా ఇంట్లో క్షణంకూడా నిలవలేకపోయారు. నా కళ్ళు పూర్తిగా పోయాయనీ, తాను చాలామంది డాక్టర్లని సంప్రదించాననీ, ఇహ లాభంలేదనీ నాన్న చెప్పినమీదట ఆయన నిరాశా నిస్పృహలతో నిలవ లేకపోయారనుకుంటాను. మరొక మూడు నెలల తర్వాత చంద్రశేఖరం గారి దగ్గరనుంచి పద్మావతి టైఫాయిడు జ్వరంవచ్చి చచ్చిపోయిందనీ, తాను మనశ్శాంతికోసం దేశం తిరగటానికి వెళ్ళిపోతున్నాననీ ఉత్తరం వచ్చింది. చేతికందిన ఓ గొప్ప అదృష్టం చెయ్యి జారిపోయినట్లు అందరూ విచారించారు. మా ఇద్దరి మధ్యా ఎలాటి అనుబంధమూ ఏర్పడకపోయినా ఆమెకోసం నేను చాలాసార్లు ఏడ్చాను. నాలాటి దుర దృష్టవంతుడు లోకంలో మరొకడు ఉండడని నన్ను నేనే తిట్టుకున్నాను. ఆ రోజు అన్నం తినలేకపోయాను. నాన్నా, చంద్రశేఖరంగారూ ఒకరి నొకరు చిత్రంగా మోసగించుకున్నారు. నాకు కళ్ళు పోతాయని తెలిసీ పద్మా వతితో పెళ్ళిచేశారు నాన్న. పద్మావతి బ్రతికి ఉండగానే చచ్చిపోయిందని ఉత్తరం వ్రాశారు చంద్రశేఖరంగారు. ఈ విషయం...మీరు సీతారామయ్య గారింట్లో ఉన్నారని రంగారావుగారు చెప్పాకే తెలుసుకున్నాననుకోండి. నాన్నమాత్రం నిజంగా పద్మావతి చచ్చి పోయిందని చాలా విచారించారు. చంద్ర శేఖరంగారిమీద జాలిపడ్డారు. కాని చంద్రశేఖరంగారు మోసంచేశారను కోలేదు. కొన్నాళ్ళ తర్వాత నాన్న

గారు పోయాక కూడా నాకు పెళ్ళి చెయ్యాలనే ప్రయత్నాలు జరిగాయి. నేను అంగీకరించలేదు కొన్నాళ్ళు. కాని తర్వాత నాకు పెళ్ళిచేసుకోవడమే మంచి దనిపించింది. ఎందుకంటే మా వ్యాపార విషయాలు చూసే అండ లభిస్తుందని మాత్రమే. ఒక పేద ఇంటి అమ్మాయి కాస్త చదువుకున్నదీ నన్ను పెళ్ళిచేసు కోవడానికి అంగీకరించింది. అత్తయ్యా, రంగారావుగారూ ఆ అమ్మాయితో పెళ్ళి చేసెయ్యాలనే నిశ్చయానికి వచ్చారు. ఆ అమ్మాయికి నలుగురు అన్నలూ, తండ్రీ ఉన్నారు. కాని ఆర్థికంగా ఉన్న వారు కాదు. అప్పుడే రంగారావుగారు సీతారామయ్యగారింట్లో వివాహానికి వెళ్ళడం జరిగింది. అక్కడ ఆయన మిమ్మల్ని ఏమిటి ప్రశ్నించారు ?" అడి గాడు పాణి.

"మా నాన్నగారిపేరు. ఆయన ఏం చేస్తూ ఉండేవారు. నువ్వేం చదివావు ? అని ప్రశ్నించి 'నీకు పెళ్ళిఅయ్యిందా ?' అని రెండు మూడుసార్లు తర్కించి ప్రశ్నించారు కాని నేను పెళ్ళికాలేదనే చెప్పారు. ఎందుకంటే పెళ్ళిఅయిం దంటే నా భర్త వివరాలు ఆయన అడుగుతారు. నాకు చెప్పడం ఇష్టం కాదు. అందుకని, అంది పద్మావతి.

'మీ భర్త వివరాలేమిటి?' అని అడగ బోయి మళ్ళీ అమే ఎప్పుడో తనంత తాను చెప్పాలి. అనుకున్న పాణి మళ్ళీ చెప్పటం ప్రారంభించాడు.

"ఆ రోజు రంగారావు వచ్చి, పాణీ" నీభార్య చచ్చిపోలేదు బ్రతికేఉంది, అనే సరికి ఆశ్చర్యపోయాను. ఆయన నీ వివరాలు చెబుతూంటే నమ్మలేక పోయాను. నువ్వు శీతారామయ్యగారి దయాదర్మ భిక్షతో వారి పంచన దీనంగా జీవిస్తున్నావంటే సహించలేక పోయాను. నిన్ను ఆదుకోకపోతే, నీకు రక్షణ ఇవ్వలేకపోతే, నా ఆస్తి ఈ సంపదా, అస్సలు నేను జీవించి ఉండ టమే వ్యర్థమనుకున్నాను. కాని నిన్ను నా దగ్గరకు ఎలా రప్పించుకోవాలి ? అస్సలు నేను నీ భర్తనంటే నువ్వు నమ్ముతావా ? నా గురించి నీకు మీ తండ్రి ఏమి చెప్పారో ; ఇలాటి సందే హాలతో, 'అయితే మనం ఇప్పుడు ఏమిటి చెయ్యాలి ?' అని రంగారావు గారిని ప్రశ్నించాను. దానికి ఆయన నీ ఇష్టం ; ఏమిటి చెయ్యాలో నువ్వే ఆలోచించు. ఆమెకు రూపం యౌవ్వనం ఉన్నాయి. అని అనుభవించాలనుకునే నీచులుంటారు. అవ్వాళ రామదాను ఆమె చీరా జాకెట్టూ చింపి నానా అల్లరీ పెట్టి శీలం దోచుకునే సమయంలో దైవికంగా శీతారామయ్య అక్కడికి వెళ్ళడం ఆమె రక్షింపబడటం జరి గాయి శీతారామయ్య సామాన్య సంసారి. దయా హృదయంతో ఆమెను

ఆదుకోగలిగాడే కాని ఆమెను పోషించే సమర్థత ఆయనకు లేదు. ఎలానో పోతుంది ఊరుకుందామంటావా? 'కల్యాణి' అంటే మళ్ళీ నేను పెళ్ళి చేసుకోబోయే అమ్మాయి, ఆ కల్యాణిని పెళ్ళి చేసుకుంటావా ? అని అడిగారు. రామదాసు నీ చీరా జాకెట్టూ చింపి అల్లరి పెట్టాడని విన్నప్పుడు నా గుండెల్లో మంటలాటిది రేగింది. అతన్ని హత్య చేసెయ్యాలన్నంత ఆవేశం వచ్చింది. ఆలోచించాను మౌనంగా కొన్ని క్షణాలు. ఆయన నీకు వివరాలన్నీ చెప్పి, నిన్ను ఒప్పించి నా భార్యగా తీసుకు వస్తానన్నారు. కాని నేను అంగీకరించ లేదు. ఈ విషయంపై చాలాసేపు ఆయనా నేనూ చర్చించుకున్నాం. చివరికి నా దగ్గర ఉద్యోగం ఉందన్న మిషతో నిన్ను తీసుకురమ్మని రంగా రావుగారితో చెప్పాను అంతే కాని ఎప్పుడూ నిన్ను భార్యగా స్వీకరించాలని కాని, ఈ గుడ్డివాడి దగ్గర నువ్వు పడి ఉండాలని కాని, ఈ ఇంట్లో నిను నా భార్యగా బంధించాలని కాని నేను అనుకోవటంలేదు పద్మావతీ! ఎప్పుడూ ఏ పరిస్థితుల్లోనూ, నేను నీ భర్తననే విషయం ఎవరికీ నీకూ కూడా తెలియకూడదని, చెప్పవద్దని, రంగారావుగారిని కోరాను, నువు ఏ ముహూర్తాన్న ఈ ఇంట్లో కాలుపెట్టావో మన మధ్య స్నేహం అనుబంధం దృఢపడ్డాయనే చెప్పాలి. మీ మాటలు వినకపోతే ఉండలేని స్థితికి నాకు తెలియకుండానే వచ్చేశాను. నీకు దూరంగా ఉండాలని కొద్దిరోజులుగా ప్రయత్నిస్తున్నాను,'' అని 'అత్తయ్యా' గట్టిగా పిల్చాడు పాణి.

అన్నపూర్ణమ్మ రాగానే, 'బీర్వా తెరచి అందులో దంతపు పెట్టి ఇలా ఇవ్వు అన్నాడు. ఆమె ఆ పెట్టె తీసిచ్చి మళ్ళీ వెళ్ళిపోయింది. ఆమెకు ఏ పనీ చేతపట్టడంలేదు. అన్నలే నీర్సం. అందులో ఏదో కంగారు.

"ఇదిగో ఈ పెట్టెలో నా పెళ్ళినాటి ఫొటోలున్నాయి చూడండి. ఆ పద్మావతి మీరు కాకపోతే, పొరపాటున రంగారావుగారూ, నేను ఆ పద్మావతి మీరే అనుకున్నందుకు సహృదయంతో మమ్మల్ని క్షమించండి." అంటూ ఆ పెట్టెపట్టుకున్న చెయ్యి ముందుకి చాపాడు పాణి.

ఆమె మౌనంగా పెట్టె తెరచి చూసింది. తానూ, తన భర్తా. పూలదండలు వేసుకుంటూన్నప్పుడు, తలంబ్రాలు పోసుకుంటూన్నప్పుడు. అతను తన మెడలో తాళికడుతూన్నప్పుడు, కర్పూరపు దండలతో మధుపర్కాలతో కేశవస్వామి ఆలయమంటపం మెట్లు దిగుతున్నప్పుడు తీసిన ఫొటోలు. ఆమెకు గతం ఎదలో మెదిలింది ఇప్పటి తన భర్తను చూసింది. ఉప్పెనలా వచ్చింది దుఃఖం. ఆనాడు విశాల

మైన కళ్ళతో తనను తపనగా చూసిన భర్త ఈనాడు అంధుడు. ఈ భయంకర సత్యం ఆమె సున్నిత హృదయాన్ని తీవ్రంగా గాయపరచింది. ఆమె మనస్సు వికలమైపోయింది. ఆమె సహించలేక పోతూంది. ఈ వాస్తవాన్ని, ''నా భర్త గుడ్డివాడిగా నేను ఊహించలేదు. ఎప్పుడైనా నా భర్తను జీవితకాలంలో చూడటం తటస్థిస్తే అందమైన కన్నులున్న భర్తగానే, నన్ను చూడగలిగిన వారిగానే ఊహించాను. అంతేకాని... నా భర్త అంధుడంటే విని సహించి బ్రతికే గుండె దిటవు నాకు లేదు పాణి గారూ! నాకు చచ్చిపోవాలనిపిస్తూంది" అంటూ దోసిట్లో మొహం దాచుకొని రోధించసాగింది పద్మావతి.

ప్చ్ నా ప్రారబ్ధ ఖర్మ నాకు సంబంధించిన అందర్నీ ఏడిపిస్తూంది. చిన్నప్పుడు అంటే నా కళ్ళుపోవక పూర్వం ఎవరన్నా ఏడుస్తూంటే అసహ్యించుకునే వాణ్ణి. చివరికి నాన్నగారు ఏడ్చినప్పుడు కూడా. కాని నా కళ్ళుపోయి నేను ఏడ్చేటైము వచ్చినప్పుడు గ్రహించాను. ఒక్కో మనిషి అన్నీ తెలిసిన విజ్ఞుడై ఉండీ కూడా ఎందుకు ఏడుస్తాడా! అని. వాస్తవ భయంకర సత్యాల్ని హృదయం తట్టుకోలేనప్పుడు, మనస్సు వికలమైపోయినప్పుడు, పూర్తిగా మానసికంగా దిగజారిపోయిన మనిషి ఏడుస్తాడని. మీరు ఏడవవలసిన అవసరం లేదు పద్మావతీ! అత్తయ్యకూ, రంగారావుగారికీ మాత్రమే తెలుసు మన సంబంధం. మీరు మీ ఇష్టమొచ్చిన చోటికి వెళ్ళిపోవచ్చు. ఉద్యోగం చేసుకోవచ్చు. మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చు." అన్నాడు పాణి.

ఆమె చివాలున లేచి అక్కడనుంచి వెళిపోయింది.

అడుగుల సవ్వడి విని ఆమె వెళిపోయిందని గ్రహించాడు పాణి. అన్నపూర్ణమ్మను పిలచి దంతపు పెట్టి జాగ్రత్త పెట్టుమన్నాడు.

ఆమె పెట్టి బీర్వాలో పెడుతూ, "ఆ అమ్మాయి ఏమంటూందిరా?" అడిగింది.

"ప్చ్. పాపం ఏమంటుంది. తన భర్త గుడ్డివాడని ఇప్పుడే తెలిసింది కదా, ఏడుస్తూంది."

"ఏం గుట్టు మనిషివిరా నువ్వు?"

"గుట్టు మనిషినే. కాని అత్తయ్యా, పద్మావతి నా భార్య అని నువ్వెవరికీ చెప్పటానికి వీల్లేదు. నామీద ఒట్టు" అన్నాడు పాణి.

''అయ్యో ఇదేం విడ్డూరం నాయనా! అయితే మీరు కలసి కాపురం చెయ్యరన్న మాట..."

"అబ్బబ్బ . మరి నన్ను విసిగించకు వెళ్ళిపో... మందు వేసుకున్నావా?"

''ఆ వేసుకున్నాను." అని ఇంకేమో అనబోయి తల రెండు చేతుల్లో పట్టుకుని

కూర్చున్న పాణివైపు చూసి మౌనంగా వెళిపోయింది.

మధ్యాహ్నం మూడు గంటల వేళ కాఫీ తెచ్చి ఇచ్చిన అప్పారావుతో, "పడ మటి గదలో ఉంటుంది. అమ్మగారికి కూడా కాఫీ తీసుకొని వెళ్ళు" అన్నాడు పాణి.

ఉంటుంది! తానెప్పుడూ వినని ఏక వచన ప్రయోగం. ఒక్కసారి పాణి వదన లోకి చూసి అతను తాగేసేక కాఫీ గ్లాసు తీసుకొని అవతలికి వెళి పోయాడు అప్పారావు.

"అమ్మగారూ కాఫీ..." అని అప్పా రావు అనగానే, "వద్దు తీసుకుపో. మీ అయ్యగారికియ్యి." అంది పద్మావతి విసురుగా. ఆమెకు ఇప్పుడు పాణిమీద చాలా కోపంగా ఉంది. ఇన్ని సంవత్స రాలు ఈ నిజం దాచాడని.

"ఆయన తీసుకున్నారండి," న్నాడు అప్పారావు

"నాకు వద్దు, అని చెప్పాను. వెళ్ళు" అంది చిరాగ్గా పద్మావతి. తన అనా రోగ్యాన్నే మరచిపోయింది అన్న పూర్ణమ్మ కొంచం వేపుడు జావ తాగింది సాయంత్రం నీర్సం తగ్గుతుందని. ఒక మోతాదుకి రెండు మోతాదులు మందు తాగేసింది. ఆమెకు సంతోషంగా, కంగా రుగా, ఏమి జరుగుతుంది? అని ఆత్రతగా ఉంది.

గదుల్లోంచి రాత్రి ఎనిమిదైనా పాణి, పద్మావతీ ఇద్దరూ బయటికి రాలేదు.

తొమ్మిది గంటలకు పాణిని వెళ్ళి భోజనం చెయ్యి, అని చెప్పింది అన్న పూర్ణమ్మ. కాస్సేపు పోయాక "చేస్తాలే అత్తయ్యా" అనేవాడతను. అతని మనస్సూ వికలంగానే ఉంది. తనపై తనకే అసహ్యం, తన జీవితంపై తనకే రోతతా కలగడంతో కళ్ళజోడు తీసి కణతలు బలంగా రుద్దుకోసాగాడు.

"తొమ్మిది గంటలు దాటింది ఇంకా ఎప్పుడు చేస్తావు బాబూ! ఏమి ప్రారబ్ద మొచ్చిందిరా?" అందావిడ జాలి ధ్వనించే స్వరంతో.

"పద్మావతి ఏంచేస్తూంది?" అడిగాడు పాణి.

"పడమటి గదిలో పడుకొంది. ఏమిటో ఇప్పుడంత కొంపలంటుకు పోయినట్లు ఏడవటమెందుకో నాకు అర్థంకావటంలేదు. వచ్చి అన్నం తినమని ఎన్నోసార్లు బ్రతిమిలాడాను" అందామె. ఆమెకు పద్మావతి ఏడవటం నచ్చలేదు.

"వెళ్ళి మా ఇద్దరికీ వడ్డన చెయ్యమని చెప్పు" అని పడమటి గదిలోకి నడిచాడు పాణి.

"పద్మావతీ!" మృదు గంభీర స్వరంతో పిలిచాడు.

చివాలున లేచి కూర్చుని "నాకు ఆకలిగాలేదు. అన్నం తినాలనీలేదు.

చచ్చిపోవాలనుంది వెళ్ళండి నన్ను పిలవకండి.'' అంది పద్మావతి రోషంగా అతని వైపుచూస్తూ.

"నాకూ అలానే ఉంది. కాని అన్నీ మన చేతుల్లో ఉంటే ఈ కలతలెందు కుంటాయి పద్మావతీ! అయితే ఇవాళ నన్ను ఉపవాసం చెయ్యమంటావా?" అన్నాడు పాణి.

రెండు క్షణాల తర్వాత 'పదండి వస్తున్నాను.'' అంది పద్మావతి.

"థాంక్స్" అని బరువుగా నిట్టూర్చి నెమ్మదిగా డైనింగ్ రూమ్‌లోకి నడి చాడు పాణి పద్మావతి అతని చెయ్యి పట్టి నడిపించలేదు.

ఏదో భోజనమైందనిపించి లేచా రిద్దరూ

పడమటి గదిలో కిటికీ ఊచలు పట్టుకు నిల్చుని బారెడు పైకి వచ్చిన చందమామవైపు కిటికెరల మధ్య నుంచి చూస్తూంది పద్మావతి. తన భర్త అంధుడు అనుకోగానే ఆమె హృదయం కృంగిపోతూంది

''పద్మావతీ నిద్రపోయారా?" పాణి గొంతు

వెనుదిరిగి ఒక్కసారి అతనివైపు చూసి బాధగా నిట్టూర్చి "లేదు," అంది పద్మావతి.

"నిజంగా మనస్ఫూర్తిగా చెబుతున్నాను పద్మావతీ! మీ ఇష్టం రంగారావుగారింటికి వెళిపోయిన సరే. లేక ఉద్యోగానికి వెళిపోయినా సరే. మీ ఇష్టం. ఎక్కడికన్నా వెళ్ళిపోండి. మీకు దుఃఖాన్నీ బాధనీ కలిగించే ఈ వాతావరణం, ముఖ్యంగా నేను. వదిలి వెళిపోండి."

అతని మాట మధ్యలో వణికే గొంతుతో "అలానే. అన్నీ మీ ఇష్టమే, రంగారావు ఇంటికి పొమ్మనటానికీ, ఉద్యోగానికి వెళ్ళిపొమ్మనటానికీ జానకిరాంకి నన్నిచ్చి పెళ్ళిచెయ్యటానికీ, అన్నిటికీ మీ ఇష్టమే. మరి తాళికట్టారు కదూ! ఎంత గుట్టు మీకు! ఎంత గట్టి మనిషి మీరు! మీకు హృదయం మమతా అనుబంధం మంచీ చెడ్డా. అనేవి ఉంటే జానకిరాంని పెళ్ళాడమంటారా? అలా అడగడం నన్ను పరీక్షించాలని కాదూ!" అడిగింది. రోషంగా.

"పద్మావతీ!" ఆ నిందారోపణకి తెల్లబోయాడతను.

"ఎందుకు ఏమీ తెలియనట్టు తెల్లబోతారు? నన్నెంత మోసంచేశారు? ఎంత సాహసముంది మీకు!"

"మోసం చేశానా! సాహసమా?"

"ఇంతకాలంగా నేనెవరో మీకు తెలిసే మీరెవరో నాకు చెప్పకపోవడం మోసం కాదూ! జానకిరాంని పెళ్ళాడమని చెప్పడం సాహసం కాదూ? పైగా పద్మావతీదేవిగారూ! అని, మీరు... మీరు, అని సంబోధన. ఎంత నటన చాతవును మీకు?"

"క్షమించి నన్ను అర్థంచేసుకో పద్మావతీ! ఆలోచించి. మిమ్మల్ని బాధించే ఈ పరిసరాలకూ నాకూ దూరంగా తొలగిపొండి.

"మీ సలహాల కోసలాం. ప్లీజ్ దయచేసి, ఒక్కసారి ఒక్క క్షణం నన్ను వంటరిగా బ్రతకనివ్వండి. నన్ను మాట్లాడించకండి. ఇంకా మీ త్యాగంతో నన్ను చిత్రవధ చెయ్యాలనుకోకండి. వెళ్ళిపొండి. నన్ను వంటరిగా వదిలెయ్యండి పాణిగారూ," అని కిటికీ ఊచలకి తల కొట్టుకు ఏడవసాగింది పద్మావతి.

అతను మౌనంగా అవతలి కెళ్ళిపోయాడు.

* * *

పాణి ఇచ్చిన చెక్కు మార్చుకున్నాడు రంగారావు. 'ఎలా అయినా పాణి మనసు చాలా ఉన్నతమైనది.' అంది సుశీలమ్మ. ఏమీ జవాబివ్వలేదు రంగారావు 'రంగారావుగారు మకాం ఎత్తేస్తున్నారు.' చెప్పాడు, రామన్న పంతులు.

"పదివేల రూపాయలకు చెక్కు ఆయన పేర వ్రాయండి," అన్నాడు పాణి గంభీర స్వరంతో.

రామన్న పంతులు చెక్కు వ్రాసిన

తర్వాత మామూలుగా అన్నపూర్ణమ్మకు కూడా చూపించి. "అదేమిట్రా మతి పోయిందా నీకు!" అని మందలించ బోయిన అన్నపూర్ణమ్మతో. "ఆయన ఋణం నే నీ జన్మలో, తీర్చుకోలే నోత్తయ్యా." అని సంతకం చేసి. "మేనేజరుగారూ," ఈ చెక్కు రంగారావుగారి కిచ్చి, నావలన జరిగిన పొరపాట్లకి క్షమాపణ కోరుకుంటున్నానని, ఆయన ఆశీర్వచనం కోసం యాచిస్తునానని చెప్పండి. ఆ దంపతులిద్దరికీ నా నమస్కారములని చెప్పండి అన్న పాణి గొంతు రుద్ధమై మూగబోయింది. చెక్కు తీసుకు వెళిపోయాడు రామన్న పంతులు.

* * *

"హేమకి సంబంధం. పాతికవేల రూపాయల కట్నం సెటిలు చేసేశాన్రా అబ్బాయ్." అంది రత్నమ్మ, కొడుకూ కోడలూ భోజనంచేసిన తర్వాత వారి చేతుల్లో వక్కపొడి వేస్తూ.

"ఎక్కడనుంచి తెస్తామమ్మా! పాతిక వేలు? నవ్వాడు" రమేష్.

"బాగుంది. శశి ఆడబిడ్డకు ఆమాత్రం కట్నం ఇచ్చి పెళ్ళి చెయ్యలేదూ! అంది కోడలివైపు చూసి నవ్వుతూ రత్నమ్మ."

తండ్రి తనకు కట్నంగా ఆస్తి రూపంలో ఇచ్చాడు కాని, డబ్బులేదే.

తెల్లబోయి చూడటం మినహా ఏమీ అనలేద్తు శశి.

''శశి తలుచుకుంటే పాతిక వేలు కట్నం ఏపాటిది ?'' అంది రత్నమ్మ మళ్ళీ స్వగతంలా.

"ఇప్పటికే అన్నయ్య నాకు చాలా డబ్బు పెట్టాడు ఇహ అతన్ని అడగటం బాగుండదు." నెమ్మదిగా అంది శశి.

"పోనీ అప్పుగానె. తర్వాత తీర్చేద్దాం, అంది రత్నమ్మ.

"అంత డబ్బు మనంతీర్చలేం" ఈ సారి విసురుగా జవాబిచ్చింది శశి.

"అతని తర్వాత ఆ డబ్బంతా నీదే కదే అమ్మాయ్ అయినా అతనే వోఅడ్డ తోవలు తొక్కి ఆస్తి పాడుచేస్తున్నాడట. అడుగు. నువ్వు కాపోతే నీ మొగుడన్నా చెయ్యాలిగా, హేమ పెళ్ళి.

మా అన్నయ్య అడ్డదారులు తొక్కే మనిషికాదు. నీ తర్వాత ఈ ఆస్తంతా నాదే కదా ! అందుకని పాతిక వేల రూపాయలియ్యి. అని నేను అతన్ని అడగలేను? అయినా అతనికేదో నంబంధం చూసి పెళ్ళిచేస్తాం.

''అ. చేస్తావు. పెళ్ళి. 'అని ఘొల్లున నవ్వి, "అబ్బాయ్. ఒక అందమైన అమ్మాయిని చేరదీశాడట నీ గుడ్డి బావ మరిది. ఆ అమ్మాయి షికార్లకీ" సిని మాలకీ తిప్పుతుందట. ఓ రాత్రి వీళ్ళిద్దరూ గదిలో పడుకునుంటే ఎవడో దొంగ దాన్ని పొడిచి పారిపోయాడట.

"మీరెప్పుడన్నా మా అన్నయ్యను చూశారా వెళ్ళి?" అడిగింది శశి రోషంగా అత్తగారి వైపు చూస్తూ."

"ఎన్నోసార్లు వెళ్ళాలనుకున్నాను కాని ... ఏదీ హేమ చదువూ, పరీక్షలూ, తర్వాత ఆ అబ్బాయి వచ్చి పోతుంటాడా ?"

"ఆ అబ్బాయెవరు ?" అడిగాడు రమేష్.

"బాగుందిరా. నీ కాబోయే బావమరిది."

"ఏం చదివాడు ? అయినా ముందస్థిగా రాకపోక లెందుకు ?"

"ఇంకో మూడేళ్ళు, డాక్టరై పోతాడు. సంబంధం రైటుచేసుకున్నాక మరి రాకపోకలుండవూ !"

"మన తాహతుకు తగ్గ సంబంధం చూడాలమ్మా ! అంతేకాని ... పోనీ తమ్ముడికి కూడా చెప్పావా ?"

"చెప్పాను కాని వాడేం ఇస్తాడు ?"

"అయితే నా దగ్గర పాతిక వేలున్నాయా అమ్మా ?"

"ఆ మాత్రం లేకపోతే పైదేశం ఎందుకు వెళ్ళినట్లు ?"

"నవ్వాడు రమేష్. నంపాదించడానికా వెళ్ళాను ? ప్రభుత్వం పంపించింది వెళ్ళాను. ఇప్పుడు జాబ్‌చేస్తే నువ్వన్నట్లు ఏమన్నా సంపాదించగలనేమో !"

(సశేషం)

Printed and Published by A. Chandrasekhar Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500 001, Editor : A. SUDHAKARA RAO

ఏ విధమయిన అచ్చుపనులైనను
అతి చక్కగా...
అనుకొన్న గడువులో
మేము చేసి యివ్వగలము

★

మా ముద్రణశాఖకు తోడుగా చిత్రకళాశాఖ,
బ్లాకు తయారీశాఖ, లితో-ఆఫ్‌సెట్
సంస్థలు సమకూడి వున్నవి.

★

ది బి. ఎన్. కె. ప్రెస్
(ప్రైవేట్) లిమిటెడ్
చందమామ బిల్డింగ్స్
వడపళని :: మదరాసు-26
ఫోన్, 44485 I—4 లైన్లు